# श्रीमद्भगवद्भारती

# శ్రీమద్భగవద్భారతీ

# SRIMAD BHAGAVADBHARATI



శ్రీ జగత్ప్రభు శ్రీ విశ్వగురు
శ్రీ విద్యారణ్య భగవాన్

# श्रीमद्भगवद्भारती

# శ్రీమద్భగవద్భారతీ

# SRIMAD BHAGAVADBHARATI



శ్రీ జగత్ప్రభు శ్రీ విశ్వగురు
శ్రీ విద్యారణ్య భగవాన్

ద్వితీయ ముద్రణం 1000 ప్రతులు
శ్రీ ప్రమాధి - కార్తీక పూర్ణిమ
భా శ శ 1921

తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి వారి
ఆర్థిక సహాయముతో అచ్చువేయించబడెను

9 అధ్యాయములు



ప్రాప్తిస్థానము
**మాతా సద్విద్యా ప్రభాదేవి**
**శ్రీ విశ్వగురు భగవన్ మఠము**
శ్రీ విద్యారణ్యనగర్
నరసరావు పేట - **522 602** ( ఆం ప్ర )

వెల రూ **35/-**

# పరిచయవాక్యాలు

సృష్ట్యాదియందు భగవానుడు వేదములను బ్రహ్మదేవున కందించెను. ద్వాపరయుగమున శ్రీకృష్ణుడై గీతోపనిషత్తులను లోకమున కొసంగెను. నేడు ఆ సచ్చిదానందపరమాత్మ, పరాత్పర సర్వేశ్వరుడు, ఆద్యాచార్యుడు స్వచ్ఛందోపాత్త లీలామానుష దేహధారియై - శ్రీకర, శంకరుడై - భగవాన్ విశ్వగురు శ్రీశ్రీశ్రీ విద్యారణ్యమహాస్వామియను పవిత్రనామముతో విరాజిల్లుచు ''శ్రీమద్భగవద్భారతి'' అను అధ్యాత్మ విద్యామహాగ్రంథమును, సర్వజీవులు అద్వితీయ అభయ ఆనంద అమృతత్వసిద్ధిపొంది తరించుటకు, సర్వలోక హితార్థము అనుగ్రహించియున్నారు.

సకలాస్తిక మహాశయులు ఈమహాగ్రంథమును అనుదినము శ్రద్ధాభక్తులతో తమపవిత్ర పఠనపాఠన వ్యవహారమందుంచుకొని, జ్ఞానవైరాగ్య శ్రీసమేతులై కైవల్య సౌఖ్యసామ్రాజ్య పట్టాభిషిక్తు లగుదురుగాక.

మూలగ్రంథ అనువాదమగు ఆంధ్రతాత్పర్య రచన యందలి దోషములను త్యజించి గుణములను స్వీకరించి పాఠకులు శ్రీ విద్యారణ్యపరమాత్ముని పలుకుల పరమార్థసారమును గ్రహించి తరించగలరని విశ్వసించుచున్నాము.



## భగవాన్ శ్రీవిశ్వగురు ధ్యానశ్లోకములు

మహాదేవ ముమాకాంతం సచ్చిదానంద మాధవమ్।
విద్యారణ్యాంశివం నౌమి విశ్వాచార్య యశస్వినమ్॥ 1

నిత్యేశ్వరం నిరాకారం నిఖిలాధార మవ్యయమ్।
నిస్సంగం నిర్గుణం శాంతం విద్యారణ్యాం నమామ్యహమ్॥ 2

సర్వార్తిశమనం కృష్ణం సదానందదశంకరమ్।
వరం విశ్వగురుం వందే శ్రీవిద్యారణ్య రూపిణమ్॥ 3

తాపత్రయ హరం శుద్ధం
లోకత్రయ సుభూషణమ్।
శ్లోకత్రయ మిదం పుణ్యం
ముక్తిం గచ్ఛతి యః పఠేత్॥

## శ్రీమద్భగవద్భారతీ ధ్యానశ్లోకము

భక్తాయ ప్రతిబోధితాం భగవతా సర్వేశ్వరేణస్స్వయం
తేనైవగ్రథితాం పురాణ కవినా హ్యద్వైత భావాద్భుతాం।
ఆనందామృత వర్షిణీం భగవతీం కైవల్యసంపత్ప్రదాం
అంబాహం త్వనుసందధామి భగవచ్ఛ్రీ భారతీంత్వాం పరామ్ ॥

ఓం నమో భగవతే శ్రీ విద్యారణ్యాయ

# నవ్యభారతజాతికి శ్రీమద్భగవద్భారతి

## పిలుపు

శ్రీ నిలయము మన పవిత్ర భారతభూమి. శ్రీ యన సంపద. లౌకిక సంపదలకే గాక, ఆధ్యాత్మిక సంపదలకు గూడ ఆవాసస్థానమగుటయే భారతదేశమునకుగల ప్రత్యేక సౌభాగ్యము. ఆధ్యాత్మికత యనునది ప్రతి భారతీయుని హృదయాంత రాళములలో ప్రకాశించు యొక దివ్యజ్యోతి. ఈ పరంజ్యోతిని ప్రజ్వలన మొనర్చగల తీవ్రసాధనలతో యావజ్జీవతపస్సుల నొనరించిన మహాత్ముల నేకులుద్భవించిన దీయవనిపైననే. మరియు సర్వజీవ పరిపాలకుడైన పరమేశ్వరుని యనేక లీలామానుషావతారములు కూడ విహారమొనరించినదీ పవిత్ర మహీతలముపైననే.

కానీ ఈనాడిట్టి దివ్యదేశమునందు జనించియు, కేవల ఐహికవిషయ భోగములే ప్రధానముగా గల పాశ్చాత్య విద్యా సంస్కృతుల కాకర్షితులైన నేటి భారత జాతీయులు బహిర్ముఖ జీవనముల గడుపుటయందే తృప్తినిజూచుచు, ప్రాచీన భారతీయుల ఆధ్యాత్మిక జీవితౌన్నత్యమునుగాని, తత్సుఖ పారమ్యమునుగాని గుర్తించక పోవుటయేగాక ఆధ్యాత్మికతయన మూఢనమ్మకమని, నవభారత సాంఘికాభ్యుదయమున కదియొక గొప్ప ఆటంకమని తలచి తమ జీవితకాల మందొక్క నిముసమైనను తదాధ్యాత్మిక

విధానములలో వెచ్చించుటకు నిరాకరించుచున్నారు. ఈ రీతిగా బాలురు, యువకులు, వృద్ధులు, విద్యావేత్తలు, దేశనాయకులు, స్త్రీలు, సర్వుల యందిట్టి యల్ప బుద్ధియే ప్రతిఫలించుటను చూచుచునేయున్నాము.. అల్పమును, అశాశ్వతమునైన భౌతిక విషయైశ్వర్య ప్రధాన విదేశీయ సంస్కృతీ వ్యామోహములో, అనంతమును, శాశ్వతమునగు స్వదేశీయ దివ్య సంపదయగు ఆధ్యాత్మిక జీవనమును తిరస్కరించి నష్టాత్ములగుచున్న నేటి భారత మానవాళి తరించగల శుభసమయమాసన్నమైనది. ''నష్టోమోహః స్మృతిః లబ్ధా'' అనుచు ఆనందాతిశయముతో ప్రతి మానవుడు ఎలుగెత్తి పలుక గల శుభతరుణమేతెంచినది.

నవ్యభారతజాతిని ఆధ్యాత్మిక దివ్య జీవనములో పునీతము జేసి శాశ్వతానంద తృప్తులను ప్రసాదించి తరింపజేయుటకే శ్రీరూపపరమార్థ జ్ఞాన స్వరూపిణియగు 'శ్రీమద్భగవద్భారతి' యుద్భవించినది.

ప్రకృతి జీవ పరమేశ్వరుల యథార్థతత్త్వములను సుస్పష్టముగ సులభసుందరశైలిలో ప్రతిపాదించుచు సంస్కృత శ్లోక రూపములో సుశబ్దార్థాలంకృతమై విరాజిల్లు ''శ్రీమద్భగవద్భారతి'' భగవదవతారులగు మన శ్రీ గురుదేవులు శ్రీశ్రీశ్రీ విద్యారణ్య విశ్వగురు భగవానులచే యావద్భారత జాతి కపరిమితానుకంపనతో యనుగ్రహింపబడిన పరమ పవిత్ర ఆధ్యాత్మిక మహాగ్రంథము.

జీవుని పరమ కర్తవ్యము ముక్తిని పొందుట. దీనికి మార్గము పరమేశ్వర జ్ఞానమును పొంది తత్కృపాపాత్రులగు రీతిలో జీవిత విధానములను మలచుకొనుటయే. అట్లుగాక వివిధ తత్త్వములు గల్గిన

ప్రాకృత పదార్థ విజ్ఞాన సేకరణగాని, వైషయికభోగానుభవ పాటవము గాని కావని వాటిని తిరస్కారమొనర్చి అద్భుతమగు వివేకజ్యోతితో భారతజాతి సంతతిని తేజోవంతముగా జేయుచున్న శ్రీ మద్భగవద్భారతి గ్రంధ దేవత సర్వభారత ప్రజానీకమునకు శిరోధార్యమై ఆరాధనీయమైనది.

భగవద్భారతి అందించుచున్న దివ్యజ్ఞాన ప్రకాశ సహాయముతో శ్రీకర భగవానుని దివ్యవిభూతులను దర్శించగలము. భగవద్వై భవదర్శనమే భవ విముక్తి సాధనము. ఇట్టి మహాసాధనమునను గ్రహించుట చేతనే 'శ్రీమద్భగవద్భారతి' కైవల్య సంప్రదగాస్తుతించ బడుచున్నది.

కనుక నష్టదాయకమైన అసద్వివేకమును వదలి వైచి సర్వులు శాశ్వతమగు ఆధ్యాత్మిక శ్రేయః ప్రాపకమగు శ్రీ విశ్వగురువుల దివ్యచరణ సాన్నిధ్య భాగ్యమును శీఘ్రముగ పొంది, శాశ్వత తృప్త్యానందములతో తరించుమని నవ్యభారత జాతికి ప్రేమాభిమానములతో పిలుపు నిచ్చి దివ్యాత్మలను గావించుచున్న శ్రీ మద్భగవద్భారతికిదే జయమంగళము! శుభ మంగళము!

మాతాచిద్విద్యా ప్రభాదేవి
(శ్రీజగత్ప్రభు శ్రీవిద్యారణ్య భగవానుల వారి
అంతే వాసినీ శిష్యురాలు)
శ్రీ విశ్వగురుభగవాన్ మఠం, నరసరావు పేట ఆం. ప్ర.

# శ్రీమద్భగవద్భారతీ

## శ్లోకానుక్రమణికా

## గ



## చ



## జ



## త



## ధ

## య



## ర

# ॥श्रीमद्भगवद्भारती॥

# శ్రీమద్భగవద్భారతీ

## ప్రథమో౽ధ్యాయః

శ్లో॥ యదృచ్ఛయోపలబ్ధం హి
మోక్షద్వార మపావృతమ్।
సేవిత్వా మాం కృతాత్మానో
లభన్తే శాశ్వతం పదమ్॥ 1

తా॥ సుకృతాత్ములు నన్ను సేవించి, అనుకొనకయే లభించిన తెరచి యుంచబడిన మోక్షద్వార మనెడు శాశ్వత పదమును పొందుదురు.

శ్లో॥ బాలోవాస్తు యువాచాన్యః
యో మాం వేత్తి మహేశ్వరమ్।
మహాన్ భవతి ధన్యాత్మా
స పూజ్యా స్సర్వ సజ్జనైః॥ 2

తా॥ బాలుడుగాని, యువకుడుగాని, ఎవడు నన్ను మహేశ్వరునిగా ఎఱుగునో అతడు మిక్కిలి ధన్యాత్ముడగును. అతడు సర్వ సజ్జనుల చేతను పూజింపఁబడును.

శ్లో॥ సర్వ ధర్మాన్సముత్సృజ్యా
మామేకం హి సనాతనమ్।
సేవస్వ సర్వభావేన
సర్వపాప విమోచకమ్॥ 3

తా॥ సర్వ ధర్మములను పరిత్యజించి, సర్వపాపముల నుండి విముక్తునిగా చేయు సనాతనుడనైన నన్నొక్కనినే సర్వదను భావముతో సేవింపుము.

శ్లో॥ మామీశ్వరం విజానీహి
సర్వస్య హృది సంస్థితమ్।
మామేవ శరణం గచ్ఛ
సర్వ వ్యాపిన మవ్యయమ్॥ 4

తా॥ ఎల్లరి హృదయములందును ఉండెడు ఈశ్వరునిగా నన్నెఱుగుము. అంతట వ్యాపించియున్న అవ్యయుడనైన నన్నే శరణము పొందుము.

శ్లో॥ మద్భక్త స్సర్వ దుర్గాణి
మత్ప్రసాదా త్తరిష్యతి।
జ్ఞాత్వేత్థం సుజనాస్సర్వే
భజన్తే మాం జనార్దనమ్॥ 5

తా॥ నా భక్తుడు నా అనుగ్రహమువలన సర్వ దుర్గములను (దాట శక్యముకాని వానిని) తరింపగలడు. ఈ విషయము నెఱిగి సుజనులందఱు జనార్దనుడనైన నన్ను భజింతురు.

శ్లో॥ మాన గర్వాది దోషై ర్యే
ప్రణష్టా హ్యావివేకినః।
నభజన్తి నరా స్తే మాం
మనుష్య దేహ ధారిణమ్॥ 6

తా॥ మానము గర్వము మున్నగు దోషములచేత వివేకమును కోల్పోయిన నరులు మానవదేహమును ధరించిన నన్ను భజింపరు.

శ్లో॥ వేదశాస్త్ర పురాణేషు
యత్ జ్ఞానం హి సునిశ్చితమ్।
జ్ఞానం తత్సముపా[శ్రిత్య]
పాలయామి జగత్త్రయమ్॥ 7

తా॥ వేదశాస్త్ర పురాణములయందు ఏ జ్ఞానము చక్కగా నిరూపింపబడినదో ఆ జ్ఞానమును సముపాశ్రయించి మూడు లోకములను నేను పాలించుచున్నాను.

శ్లో॥ కథయిష్యంతి తేజ్ఞానం
ఆచార్యా స్తత్త్వ దర్శినః।
జ్ఞాన విజ్ఞాన సంతృప్తాః
సర్వభూత దయాళవః ॥ 8

తా॥ జ్ఞాన విజ్ఞానములచేత సంతృప్తులైన సర్వభూతములయందు దయాళువులైన, తత్త్వదర్శినులైన ఆచార్య వరేణ్యులు జ్ఞానమును చెప్పగలరు.

శ్లో॥ ప్రణిపాత పరిప్రశ్న
శుశ్రూషా వినయో క్తిభిః।
బ్రహ్మచర్య తపోభ్యాంచ
ప్రణనీయా గురోర్మతిః॥ 9

తా॥ పాదాభి వందనము, తఱిపేచి ప్రశ్నించుట, శుశ్రూష. వినయమైన పలుకులు, బ్రహ్మచర్యము, తపస్సు అను వానిచేత గురువు యొక్క బుద్ధిని తృప్తిపరుపవలెను.

శ్లో॥ శృతిస్మృతి పురాణేషు
సూత్రభాష్యకృతిష్వపి।
పురామయా తదు క్తం హి
యత్ జ్ఞాతవ్యం ముముక్షుభిః॥ 10

తా॥ ముముక్షువులచేత తెలిసికొనదగిన దేదిగలదో అయ్యది వేదములయందును ధర్మశాస్త్ర పురాణముల యందును, సూత్రభాష్యము మున్నగు గ్రంథములయందును పూర్వమే నాచే చెప్పబడెను.

శ్లో॥ సర్వపాప విము క్తస్య
సర్వకామ విరాగిణః।
సర్వవిజ్ఞాన పూర్ణస్య
సర్వానందో భవేద్ధ్రువమ్॥ 11

తా॥ సర్వపాపముల నుండి విడివడిన వానికిని, సర్వకామ ములయందును విరాగియైన వానికిని, సర్వవిజ్ఞానవముతో పరిపూర్ణుడైన వానికిని సర్వానందము నిశ్చయముగా కలుగును.

శ్లో॥ స్వయం శ్రద్ధా విహీనస్య
గురు స్తస్య కరోతి కిమ్।
పరాం శ్రద్ధా ముపాశ్రిత్య
గురుభక్తిం సదాకురు॥ 12

తా॥ స్వయముగా శ్రద్ధ లేని వానికి గురువేమిచేయును? అందువలన ఉత్కృష్టమగు శ్రద్ధ నాశ్రయించి ఎల్లకాలము గురు భక్తిని చేయుము.

శ్లో॥ మయాఽవ్యక్త స్వరూపేణ
వ్యాప్తం సర్వమిదం జగత్।
అసంగం భూతభర్తారం
సర్వాత్మానం భజస్వమామ్॥ 13

తా॥ అవ్యక్త స్వరూపుడనైన నాచేత ఈ సమస్త జగమును వ్యాపింపబడియున్నది. సంగ రహితుడను, భూత భర్తను సర్వాత్మను అగు నన్ను భజింపుము.

శ్లో॥ గమిష్యసియదా మౌఢ్యం
ధర్మాధర్మవినిర్ణయే।
మాంకురుత్వం తదాధ్యానం
జ్ఞానం ప్రాప్య తరిష్యసి॥ 14

తా॥ ధర్మము అధర్మము అనువాని నిర్ణయమున నీవు అజ్ఞతను పొందినపుడు నన్నుధ్యానింపుము. అపుడు నీవు జ్ఞానమును పొంది తరింపగలవు.

శ్లో॥ నిరుద్ధమపి తే చిత్తం
మోహం యదా గమిష్యతి।
మామీశ్వరం తదా ధ్యాత్వా
మోహాత్ త్వంహి విమోక్ష్యసే॥ 15

తా॥ నీచిత్తము అడ్డగింపబడినప్పటికినీ ఎప్పుడు మోహమును పొందునో, అపుడు ఈశ్వరుడనగు నన్ను ధ్యానించి మోహము నుండి విడివడ గలవు.

శ్లో॥ శ్రౌతాన్య వైదికానీతి
ద్వివిధాని మతాని వై।
శృణు వక్ష్యే యథాసత్యం
వైదికం తు మతం హి మే॥ 16

తా॥ వైదికములు, అవైదికములు నని మతములు రెండు విధములు కలవు. అందు సత్యమైన దానిని చెప్పుచున్నాను. వినుము. వైదిక మైనదియే నామతము.

శ్లో॥ అధికార విహీనాయే
తారణార్థంచ తానపి।
మతాన్య వైదికానీతి
త్వం స్వస్థోభవ వైదికః॥ 17

తా॥ అధికారవిహీనులగు వారిని గూడ తరింపజేయుట కొఱకు, అవైదికమతములు కలవు. కనుక వైదికుడవగు నీవుస్వస్థుడవుకమ్ము॥

శ్లో॥ రాగద్వేష వియుక్తోఽస్మి
సర్వేషాంచ సమోఽస్మ్యహమ్।
యథా భక్తి స్తథా ముక్తిః
భక్తిం మయిస్థిరాం కురు॥ 18

తా॥ నేను రాగద్వేషముల నుండి విడివడిన వాడను. అందఱియందును సముడను. భక్తి యెట్టిదో ముక్తి యట్టిది. కావున నాయందు స్థిరమైన భక్తి చేయుము.

శ్లో॥ స్థిత్వాఽహం తవ హృద్దేశే
బోధయామి హితాయతే।
సర్వవేదరహస్యార్థ
మంతర్వాణీం శ్రుణుష్వమే॥ 19

తా॥ నీయొక్క హృదయ దేశమున నుండి నేను నీ హితము కొఱకు సర్వ వేదముల యొక్క రహస్యార్థమును బోధించు చున్నాను. నా అంతర్వాణిని వినుము.

శ్లో॥ వారిదాత్పతితం నీరం
యథాగచ్ఛతి వారిధిమ్।
గురుదైవ నమస్కారః
మామేవ ప్రతిగచ్ఛతి॥ 20

తా॥ మేఘము నుండి పడిన నీరు సాగరమునకెట్లు పోవునో అట్లు గురుదైవ నమస్కారము నన్నే పొందును.

శ్లో॥ సంపూర్ణ భక్తి భావేన
సమర్పితం యద స్తితత్।
అల్పంవా బహువా సత్యం
స్వీకరోమి ప్రియాత్మనా॥ 21

తా॥ సంపూర్ణమైన భక్తి భావముతో నాకు సమర్పింపబడిన దేదిగలదో అది అల్పమైనను అధికమైనను ప్రియమైన ఆత్మతో స్వీకరింతును. సత్యము.

శ్లో॥ యం జ్ఞాత్వా ఋషయస్స ర్వే
పరమార్థ పదంగతాః।
తమేకం సర్వలోకానాం
నిత్యేశ్వరం నిబోధమామ్॥ 22

తా॥ సర్వమహర్షులును ఎవనిని తెలిసికొని పరమార్థ పదమును పొందిరో, సర్వలోకములకు ఒక్కడేయగు ఆ నిత్యుడైన ఈశ్వరునిగా నన్ను ఎఱుఁగుము.

శ్లో॥ యయాచ మాయయా నిత్యం
భ్రాన్తా భవన్తి జీవినః।
జితాహి సామహామాయా-
మద్భక్తేన వివేకినా॥ 23

**తా॥** ఏమాయచేత నిత్యమును జీవులు భ్రాంతులగు చున్నారో అట్టి మహామాయ వివేకవంతుడైన నా భక్తుని చేత జయింపబడినదిగదా!

శ్లో॥ సర్వాధిక ముపాశ్రిత్య
మామేకం పురుషోత్తమమ్।
యస్తిష్ఠతి వివేకీ తం
నోపేక్షే శరణాగతమ్॥ **24**

**తా॥** సర్వాధికుడనైన, పురుషోత్తముడనైన నన్నొక్కనినే ఆశ్రయించి యేవివేకవంతుడుండునో అట్టి శరణాగతుని నేను ఉపేక్షింపను.

ఇతి శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవతః కృతౌ
శ్రీమద్భగవద్భారత్యాం అధ్యాత్మ విద్యాయాం
ప్రథమో உధ్యాయః

ఇది శ్రీవిశ్వగురు శ్రీమద్విద్యారణ్యభగవత్కృతియగు
శ్రీమద్భగవద్భారతియను ఆధ్యాత్మవిద్యయందు
ప్రథమాధ్యాయము.

# ॥श्रीमद्भगवद्भारती॥

# శ్రీమద్భగవద్భారతీ

## అథ ద్వితీయోఽధ్యాయః

శ్లో॥ అవ్యయానంత శక్తేశ్చ
సర్వలోకాధివాసినః।
తత్త్వం మేయోఽభిజానాతి
బంధాత్సహి ప్రముచ్యతే॥ 1

తా॥ అవ్యయమును, అనంతమును అగు శక్తిగల వాడనైన, సర్వలోకములను అధివసించిన వాడనగు నాయొక్క తత్త్వమును చక్కగా ఎవడెఱుగునో వాడు బంధము నుండి ముక్తుడగును.

శ్లో॥ మమ మాయా ప్రభావేన
సులభో నాస్మి సర్వదా।
మహామాయా మిమాం తీర్త్వా
మునయో మత్పదం గతాః॥ 2

తా॥ నా యొక్క మాయాప్రభావముచేత ఎల్లవేళల నేను సులభుడను కాను. మునివరేణ్యులు ఈమహామాయను దాటి నా పదమును పొందియుండిరి.

శ్లో॥ యదనంతం మమైశ్వర్యం
సంగ్రహేణ వదామ్యహమ్।
తదద్భుతం సువిజ్ఞాయ
ముక్తో భవతి మానవః॥ 3

తా॥ అనంతమైన నా యైశ్వర్య మేదిగలదో దానిని సంగ్రహముగా చెప్పుచున్నాను. మిక్కిలి అద్భుతమైన అద్దానిని చక్కగా తెలిసికొని మానవుడు ముక్తుడగుచున్నాడు.

శ్లో॥ భక్తాయదాచ పీడ్యంతే
దుర్బుద్ధిభి రసాధుభిః।
తదానీం చ వశీకృత్యా
మాయాం మే ప్రభవామ్యహమ్॥ 4

తా॥ దుర్బుద్ధులగు అసాధువులచేత భక్తు లెప్పుడు పీడింపబడుదురో అప్పుడు నా మాయను వశమొనర్చుకొని నేను సంభవించెదను.

శ్లో॥ సంరక్షణాయ భక్తానాం
వినాశాయ చ వైరిణాం।
సంవర్ధనాయ ధర్మస్య
సంభవామి నిజేచ్ఛయా॥ 5

తా॥ భక్తులను సంరక్షించుట కొఱకును, శత్రువుల వినాశము కొఱకును, ధర్మమును వృద్ధిపొందించుట కొఱకును ఇచ్ఛానుగుణముగ జన్మించుచున్నాను.

శ్లో॥ అప్రాకృతం మమైశ్వర్యం
దేహవత్త్వం విలక్షణమ్।
కర్మతత్వం చ యోవేత్తి
ముక్తి స్తస్య కరస్థితా॥ 6

తా॥ ప్రాకృతముకాని నా ఐశ్వర్యమును, విలక్షణమైన దేహవత్వమును మరియు కర్మతత్త్వమును ఎవడు తెలిసికొనుచున్నాడో వానికి ముక్తి చేతియందు కలదిగానగును.

శ్లో॥ మాంవిద్ధి భూతభర్తారం
శ్రీవిష్ణుం భోగ యోగినమ్।
అభిజానీహి మామేవ
శివేశం జ్ఞానయోగినమ్॥ 7

తా॥ భూతములను భరించువాడనగు, భోగయోగినగునన్నే శ్రీ మహావిష్ణువుగా ఎఱుగుము. జ్ఞానయోగినైన నన్నే శివేశునిగ తెలిసికొనుము.

శ్లో॥ అహం వేదవిదాం వ్యాసః
ఆచార్యాణాం చ శంకరః।
వరదానాం నృసింహశ్చ
ధ్వజానాం ప్రణవధ్వజః॥ 8

తా॥ నేను వేదములను తెలిసినవారిలో వ్యాసుడను ఆచార్యులలో శంకరుడను. వరముల నిచ్చువారిలో నృసింహుడను ధ్వజములలో ప్రణవధ్వజమును.

శ్లో॥ కపీనా మాంజనేయోఽస్మి
విత్తేశో ధనినా మహమ్।
నృపాణాం రామచంద్రోఽస్మి
ముక్తానాం శ్రీశుకోఽస్మ్యహమ్॥ 9

తా॥ నేను కపులలో ఆంజనేయుడను, ధనవంతులలో కుబేరుడను, రాజులలో రామచంద్రుడను, ముక్తులలో శ్రీ శుకుడను.

శ్లో॥ మహేంద్రోఽస్మి సురాణాంచ
ధీమతాంచబృహస్పతిః।
తేజస్వినా మహం భాస్వాన్
శిశిరాణాం సుధాంశుమాన్॥ 10

తా॥ నేను దేవతలలో మహేంద్రుడను. బుద్ధిమంతులలో బృహస్పతిని. తేజోవంతులలో భాస్కరుడను. చల్లనైన వానిలో చంద్రుడను (అమృత కిరణుడను)

శ్లో॥ క్షేత్రాణా మస్మి కాశీ చ
తీర్థానా మస్మి సాగరః।
ధేనురస్మి పశూనాంచ
వర్ణానాం బ్రాహ్మణోఽస్మ్యహమ్॥ 11

తా॥ నేను క్షేత్రములలో కాశీ క్షేత్రమును. తీర్థములలో సముద్రమును, పశువులలో గోవును, వర్ణములలో బ్రాహ్మణుడను.

శ్లో॥ వినయోఽస్మి గుణానాంచ
యజ్ఞోఽస్మ్యహం సుకర్మణాం।
అభయంచాస్మి వీరాణామ్
విశ్వాసోఽస్మి మహాత్మనామ్॥ 12

తా॥ నేను గుణములలో వినయమును, సత్కర్మలలో యజ్ఞమును, వీరుల అభయమును. మహాత్ముల యొక్క విశ్వాసమును.

శ్లో॥ వాగ్మినాం సత్యవాదీచ
శుచీనాం బ్రహ్మచార్యహం।
భూరిప్రదోఽస్మి దాతౄణాం
శాంతోఽస్మి జ్ఞానినామహమ్॥ 13

తా॥ నేను చక్కగా పలుకువారిలో సత్యవాదిని. పరిశుద్ధ వంతులలో బ్రహ్మచారిని, దాతలలో భూరి ప్రదుడను (సువర్ణదాత, మహాదాత), జ్ఞానవంతులలో శాంతుడను.

శ్లో॥ పితాహం సర్వభూతానాం
మాతా చాస్మి తథాగురుః।
భర్తాహం సర్వవిశ్వస్య
సుహృచ్చాస్మి ప్రియంకరః॥ 14

తా॥ సర్వభూతములకు నేను తండ్రిని తల్లిని. అట్లే గురువును. నేను సర్వ ప్రపంచమును భరించువాడను. ప్రియం కరుడైన మిత్రుడను.

శ్లో॥ పితామహోஉస్మి సాక్షీచ
మాంవిద్ధి ప్రపితామహమ్।
వేదా అహం పరంజ్ఞానమ్
ప్రభుశ్చాస్మి దృఢవ్రతః॥ 15

తా॥ నేను పితామహుడను. సాక్షిని నన్ను ప్ర పితా మహుడని తెలిసికొనుము. నేను వేద సమూహమును. ఉత్కృష్టజ్ఞానమును దృఢమైన వ్రతముగల ప్రభుడను.

శ్లో॥ ద్విజానా మస్మ్యహం త్యాగీ
యతీనాం జ్ఞానవానహమ్।
పోషకానాం గృహస్థోஉస్మి
క్షత్రియాణామహం ప్రభుః॥ 16

తా॥ ద్విజులలో నేను త్యాగిని. యతులలో జ్ఞానవంతుడను. పోషించువారిలో గృహస్థుడను. క్షత్రియులలో ప్రభుడను.

శ్లో॥ శ్రీరస్మ్యహం శుభానాంచ
వనితానాం పతివ్రతా।
జయ హేతురహం ధర్మః
జేతౄణాంచ జయోஉస్మ్యహమ్॥ 17

తా॥ శుభములలో నేను శ్రీ ని. వనితలలో పతివ్రతను, జయమునకు కారణమైన ధర్మమును నేను. నేను జయశీలుర జయమును.

శ్లో॥ రుచీనాం చాస్మిమాధుర్యం
మాతుః ప్రేమాహమేవచ।
శృంగారోఽస్మి రసానాంచ
కాలస్య నియమోఽస్మ్యహమ్॥ 18

తా॥ రుచులలో నేను మాధుర్యమును. తల్లియొక్క ప్రేమయే నేను. నేను రసములలో శృంగారమును. నేను కాలమునకు నియమమును.

శ్లో॥ సౌరభం చాస్మి పుష్పాణాం
సౌందర్యం ప్రకృతేః పరమ్।
న్యాయోఽస్మి న్యాయకర్తౄణాం
శీలంచాస్మి సతాం సదా॥ 19

తా॥ పుష్పములయందలి సువాసనను నేను. ప్రకృతి యొక్క ఉత్కృష్టమగు సౌందర్యమును నేను. న్యాయకర్తల న్యాయమును నేను. సత్పురుషుల శీలమును నేను.

శ్లో॥ సత్త్వప్రదోస్మ్యహం వాయుః
వరుణోఽస్మి జలప్రదః।
భీకరాణా మహం మృత్యుః
వైద్యోఽహం హితకారిణామ్॥ 20

తా॥ బలమునిచ్చు వారిలో వాయుదేవుడను నేను. జలము నొసంగెడు వరుణుడను నేను. భయంకరులలో మృత్యువును నేను. హితము చేయువారిలో వైద్యుడను నేను.

శ్లో॥ క్షీరంచాస్మిద్రవాణాంచ
యౌవనం వయసామహం।
శుద్ధానామహ మగ్నిశ్చ
యోగినాం చ పతంజలిః॥ 21

తా॥ ద్రవపదార్థములలో నేను క్షీరమును. వయస్సులలో నేను యౌవనమును. పరిశుద్ధులలో నేనగ్నిని, యోగులలో నేను పతంజలిని.

శ్లో॥ నేతాస్మ్యహం ప్రజానాంచ
ధాతాహం కర్మసంతతేః।
పాపఘ్నానామహం గంగా
రోగఘ్నానామహం సుధా॥ 22

తా॥ ప్రజలకు నేను నాయకుడను, కర్మ సమూహమునకు నేను సృష్టికర్తను, పాపములను నశింపజేయు వానిలో నేనుగంగను. రోగములనుహరించువానిలో నేను అమృతమును.

శ్లో॥ దైవజ్ఞః కాలవేత్తౄణాం
రంజకానాం చ గాయకః।
శిల్పినాం విశ్వకర్మాహం
నటకోఽస్మి వినోదినామ్॥ 23

తా॥ కాలము నెఱిగినవారిలో నేను దైవజ్ఞుడను. రంజింపజేయువారిలో గాయకుడను. శిల్పులలో విశ్వకర్ముడను, వినోదింపజేయువారిలో నటకుడను.

శ్లో॥ భాషాణామస్మి గైర్వాణీ
శాబ్దికానాం చ పాణినిః।
వేదానుగోఽస్మి తర్కాణాం
ప్రాణినాం చా భయప్రదః॥ 24

తా॥ నేను భాషలలో సంస్కృతమును. శబ్ద శాస్త్రజ్ఞులలో పాణినిని. తర్కములలో వేదముల ననుసరించువాడను. ప్రాణులకు అభయము నిచ్చువాడను.

శ్లో॥ అస్థిరాణాం మనశ్చాహం
క్షణికానామహం తటిత్।
ధార్మికోఽస్మి జనానాంచ
నిశ్చయోఽస్మి సుధీమతామ్॥ 25

తా॥ అస్థిరములైన వానిలో మనస్సును నేను. క్షణ కాలముండు వానిలో మెఱపును నేను, జనులలో ధార్మికుడను. సుధీమంతుల నిశ్చయుడను.

శ్లో॥ అహింసకో వ్రతస్థానాం
జనకోఽహ మసంగినామ్।
యాదవానాం చ కృష్ణోఽహం
ధర్మజ్ఞానామహం మనుః॥ 26

తా॥ వ్రతమునందున్న వారిలో అహింసకుడను. సంగ రహితులలో జనకుడను. యాదవులలో కృష్ణుడను. ధర్మవేత్తలలో మనువును.

శ్లో॥ శ్రేష్ఠాచారో౽స్మి శిష్టానాం
కీర్తిరస్మి యశస్వినాం।
స్వేచ్ఛాహమస్మి ముక్తానాం
ఆనందో బ్రహ్మణో౽స్మ్యహమ్॥ 27

తా॥ శిష్టులలో శ్రేష్ఠమైన ఆచారము కలవాడను. యశస్సుకలవారియొక్క కీర్తిని నేను. నేను ముక్తులయొక్క స్వేచ్ఛను. నేను బ్రహ్మానందస్వరూపుడను.

శ్లో॥ జితకామో౽స్మి ధీరాణాం
అలుబ్ధో ధనినామహం।
సుఖినాం చాస్మి సంతుష్టో
నిర్వైరో౽స్మి వివేకినామ్॥ 28

తా॥ నేను ధీరులలో కామమును జయించినవాడను. ధనవంతులలో లోభగుణము లేనివాడను, సుఖవంతులలో సంతుష్టుడను. వివేకవంతులలో వైరభావము లేనివాడను.

శ్లో॥ అహమేకో జగన్నాథః
జగత్కారణ కారణమ్।
సర్వాత్మక మహాదేవో
వాసుదేవో౽స్మి మాధవః॥ 29

తా॥ నేనొక్కడనే జగత్తునకు నాథుడను. జగత్తునకు కారణమైన దానికి కారణుడను. సర్వాత్మకుడైన మహాదేవుడను. వాసు దేవుడైన మాధవుడను.

శ్లో॥ సర్వకర్తృ మహావిష్ణుం
సర్వభోక్తృ మహేశ్వరం।
విధిమాం చ హ్యకర్తారం
సర్వసాక్షిణ మవ్యయమ్॥ 30

తా॥ సర్వమునకు కర్తయైన మహావిష్ణువును, సర్వమునక భోక్తయైన మహేశ్వరుడను అగు నన్ను కర్తనుకానివానినిగను, సర్వమునకు సాక్షియైనవానినిగను, అవ్యయునిగను తెలిసికొనుము.

శ్లో॥ బ్రహ్మాదిజీవిన స్సర్వే
హ్యర్థినో నాత్ర సంశయః।
ఏకోభవామ్యహం దాతా
సర్వభూత మహేశ్వరః॥ 31

తా॥ బ్రహ్మ మున్నగు సర్వజీవులును అర్థించువారే, ఇందు సంశయములేదు. సర్వభూతములకు మహేశ్వరుడనగు నేనొక్కడనే దాతను.

శ్లో॥ బ్రహ్మేంద్రాది సురాస్సర్వే
నృపాద్యా భూజనా స్తథా।
సర్వేచ ప్రాణినో భీతాః
అహమేకోఽస్మి నిర్భయః॥ 32

తా॥ బ్రహ్మ, ఇంద్రుడు మున్నగు దేవతలు, రాజులు మున్నగు భూజనులు సర్వప్రాణులును భీతులే. నేనొక్కడనే నిర్భయుడను.

శ్లో॥ మహత్ప్రభావ సంపన్నా
శ్రియాయుక్తాశ్చ యే జనాః।
తాన్హి విద్ధి మహాభాగ
మ త్తేజోంశ సముద్భవాన్॥ 33

తా॥ ఓ మహాభాగా! మహా ప్రభావ సంపన్నులును, లక్ష్మీవంతులైన జనులును నా తేజస్సు యొక్క అంశమువలన పుట్టిన వారని తెలిసికొనుము.

శ్లో॥ విశ్వస్య సృష్టికర్తాస్మి
విశ్వపాలన తత్పరః।
విశ్వస్య లయకర్తాహం
మాంహి విద్ధి మహేశ్వరమ్॥ 34

తా॥ నేనీ ప్రపంచముయొక్క సృష్టికర్తను. ఈ ప్రపంచ పరిపాలనమందు తత్పరుడను. ఈ ప్రపంచమునకు లయ కారుడను. నన్ను మహేశ్వరునిగా తెలిసికొనుము.

శ్లో॥ వ్యక్తావ్యక్త మిదంవిద్ధి
జగత్సర్వం చరాచరం।
యత్సద్వద్భాతి తత్సృష్ట
మంశేన మమతేజసః॥ 35

తా॥ వ్యక్తమును అవ్యక్తమునై చరాచరాత్మకమై యే సర్వ ప్రపంచము ప్రకాశించుచున్నదో అయ్యది నా తేజస్సుయొక్క అంశమువలన సృజింపబడినదిగా తెలిసికొనుము.

శ్లో॥ మమ మాయావిలాసేన
కల్పితోఽయం జగత్ర్కమః।
తాం తుసుదుర్గమాం మాయాం
మత్ప్రపన్న స్తరిష్యతి॥ 36

తా॥ ఈ జగత్తుయొక్క క్రమమంతయు నా మాయా విలాసముచేత కల్పింపబడినది. దాటుటకు శక్యముకాని ఆ మాయను నా యందు ప్రపత్తి భావము (సర్వాత్మనా శరణు పొందుట) కలవాడు దాటగలడు.

శ్లో॥ యోగేశ్వరస్యమేశక్తిః
జ్ఞాతుం ద్రష్టుం సుదుర్లభా।
అనన్య భక్తిభావేన
భజతాం మాం సుగోచరా॥ 37

తా॥ యోగేశ్వరుడనగు నాయొక్క శక్తి తెలిసికొనబడుటకు, చూడబడుటకు మిక్కిలి దుర్లభమైనది. అనన్యమైన భక్తిభావముతో నన్ను భజించువారికది సుగోచరమగును.

శ్లో॥ అనంతమవ్యయం విద్ధి
మమైశ్వర్యం స్వతోద్భుతం।
భజస్వమాం మహేశానం
సమానాధిక వర్జితమ్॥ 38

తా॥ అనంతమును, అవ్యయమును, స్వభావసిద్ధమును అగు నా యొక్క ఐశ్వర్యమును తెలిసికొనుము. సమానులు గాని అధికులుగాని లేనట్టి మహేశానుడనైన నన్ను భజింపుము.

ఇతి శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవతః కృతౌ
శ్రీమద్భగవద్భారత్యాం అధ్యాత్మ విద్యాయాం
ద్వితీ యోఽధ్యాయః

ఇది శ్రీవిశ్వగురు శ్రీమద్విద్యారణ్యభగవత్కృతియగు
శ్రీమద్భగవద్భారతియను అధ్యాత్మ విద్యయందు
ద్వితీయాధ్యాయము

## ।।श्रीमद्भगवद्भारती ।।

## శ్రీమద్భగవద్భారతీ

### అథ తృతీయోఽధ్యాయః

శ్లో॥ విద్ధ్యేతత్సావధానేన
తత్త్వం మమ శుభప్రదమ్।
గోప్యోత్తమ మలభ్యంచ
జ్ఞాత్వా యత్త్వం విమోక్ష్యసే॥ 1

తా॥ మిక్కిలి రక్షింపదగినదియును. పొందశక్యము కానిదియునగు ఏనా శుభప్రదమైన తత్త్వమును తెలిసికొని విముక్తుడవు కాగలవో, దానిని సావధానముగ తెలిసికొనుము.

శ్లో॥ బ్రహ్మణేఽప్యాది కర్త్రేచ
బ్రహ్మణే సృష్టికారిణే।
సర్గాదౌ ప్రోక్త వానస్మి
తత్త్వంత్విదం విముక్తిదమ్॥ 2

తా॥ ఆదికర్తయగు బ్రహ్మకును సృష్టినొనర్చు బ్రహ్మకును, విముక్తినొసగెడు ఈ తత్త్వమును సృష్టి ఆరంభమున నేను బోధించితిని.

శ్లో॥ వ్యాఖ్యాతం హియదాశాస్త్రం
అన్యథా కుజనై స్తదా।
వ్యాఖ్యాతుం చ యథాశాస్త్రం
అవతారో భవేద్ధ్రువమ్॥ 3

తా॥ ఎప్పుడు కుజనులచేత శాస్త్రము విపరీతముగా వ్యాఖ్యానింపబడునో, అప్పుడు శాస్త్రానుసారముగా వ్యాఖ్యానము చేయుటకు అవతారమగును ఇది నిశ్చయము.

శ్లో॥ మాయాశక్తి ప్రభావేన
భ్రాంతోయం సకలో జనః।
శాస్త్రస్య హృదయం జ్ఞాతుం
సమర్థో న భవిష్యతి॥ 4

తా॥ మాయాశక్తి ప్రభావముచేత జనము సమస్తము భ్రమపడినదై శాస్త్రముయొక్క హృదయము నెరుగుటకు సమర్థమగుట లేదు.

శ్లో॥ స్రష్టాహం వర్ణధర్మాణాం
జీవబంధ విముక్తయే।
ఆచరంత్స్వధర్మం హి
స్వాత్మశుద్ధిం సమశ్నుతే॥ 5

తా॥ జీవులయొక్క బంధవిమోచనకై వర్ణ ధర్మములను నేను సృజించితిని. ఆ జీవుడు స్వధర్మము నాచరించుచు స్వాత్మ శుద్ధిని పొందును.

శ్లో॥ గుణ కర్మానురూపేణ
వర్ణమాప్నోతి మానవః।
వర్ణాశ్రమ సదాచారః
కర్తవ్యో మోక్షమిచ్ఛతా॥ 6

తా॥ తనయొక్క గుణకర్మముల కనుగుణముగా మానవుడు వర్ణమును పొందుచున్నాడు. మోక్షమును గోరెడివాడు వర్ణాశ్రమముల చక్కని యాచారమును పాటింపవలయును.

శ్లో॥ నమేస్తి కర్మ సంగశ్చ
స్పృహా నాస్తి హి తత్ఫలే।
అసంసారిణమేవం మా
మకర్తారం చ విద్ధివై॥ 7

తా॥ నాకు కర్మలయొక్క సంగము లేదు. వాని ఫలములందు ఇచ్ఛలేదు. ఇట్లు అసంసారినైన నన్ను అకర్తనుగకూడ తెలిసికొనుము.

శ్లో॥ కార్యం కించిత్తథా ప్రాప్యం
సర్వలోకేషు సర్వధా।
సర్వకాలేషు నాస్త్యేవ
సతో భగవతో హి మే॥ 8

తా॥ అన్ని కాలములలోను, సమస్తలోకముల యందును చేయవలసిన పనిగాని, పొందవలసినదిగాని ఏ కొలదియైనను నిత్యుడనైన భగవంతుడనగు నాకు ఏ ప్రకారముగనైనను ఉండుటలేదు.

శ్లో॥ సర్వభూతాధివాసోహం
సర్వవిజ్ఞాన సంయుతః।
సర్వానంద ప్రపూర్ణోఽస్మి
సచ్చిదానంద విగ్రహః॥ 9

తా॥ నేను సర్వభూతములను అధివసించి యున్న వాడను. సర్వ విజ్ఞానముతో కూడియున్న వాడను. సర్వానందముతో నిండియున్న వాడను. సచ్చిదానందమునకు విగ్రహమైనవాడను.

శ్లో॥ వాసుదేవోఽస్మ్యహం విష్ణుః
సర్వకారణ కారణం।
జనార్దనోఽస్మ్యహం కృష్ణః
మాయా సాగర తారకః ॥ 10

తా॥ సమస్తమునకు కారణమైన దానికి కారణుడనైన వాసుదేవుడనైన విష్ణువును నేను. మాయ యనెడు సముద్రమును తరింపచేయు జనార్దనుడనగు కృష్ణుడను నేను.

శ్లో॥ శివోఽస్మి శివభక్తానాం
వైష్ణవానాం రమాధవః।
శాక్తేయానామహం శక్తిః
సౌరాణా మస్మి భాస్కరః॥ 11

తా॥ నేను శివభక్తులకు శివుడను విష్ణుభక్తులకు విష్ణువును. శక్తిని పూజించువారలకు శక్తిని. సూర్యారాధకులకు సూర్యుడను.

శ్లో॥ గాణాపత్య మతస్థానాం
భవామ్యేవం గణేశ్వరః।
స్కన్దోఽస్మి స్కన్దభక్తానాం
సర్వోఽస్మి సమభావినామ్ ॥ 12

తా॥ గాణాపత్య మతస్థులకు నేను గణేశ్వరుడనగుదును. కుమారభక్తులకు నేను కుమారస్వామిని సమభావులగు వారికి నేను సర్వుడను.

శ్లో॥ సర్వయోగ ప్రదాతాస్మి
హ్యాశ్రితానా మనుక్షణం।
సర్వవిఘ్న హరశ్చాస్మి
భక్తానాం మమ సర్వదా॥ 13

తా॥ అనుక్షణము నన్నాశ్రయించిన వారికి సమస్తమైన యోగవమును యిచ్చెదను. నాభక్తులకు సర్వ వేళల సర్వ విఘ్నములను హరించెదను.

శ్లో॥ అష్టాంగ యోగనిష్ఠానాం
సర్వసిద్ధి ప్రదాయకః।
భక్తిభావ ప్రపూర్ణానాం
ముక్తిదాతాహమేవచ॥ 14

తా॥ అష్టాంగయోగవమునందు నిష్ఠగల వారికి, నేను సర్వసిద్ధులను యిచ్చువాడను. భక్తిభావముతో నిండిన వారికి నేనే ముక్తి దాతను.

శ్లో॥ ఆర్తో హ్యార్తిహరో హ్యార్తస్య
జిజ్ఞాసోశ్చ ఐపేకదః
దాతాస్మి ధనకామస్య
హ్యేతత్మాతత్త్వవిదోఽస్మ్యహమ్॥ 15

తా॥ నేను ఆర్తునకు ఆర్తిహరుడను. తెలిసికొన గోరువానికి ఐపేకమునిచ్చువాడను. ధనమును గోరువానికి దాతను. తత్త్వము నెఱిగినవానికి ఆత్మను.

శ్లో॥ మాయామోహ విమూఢానాం
సర్వేషాంతు సుదుర్లభః
వివేకినాం మదీయానాం
సర్వదా సులభోఽస్మ్యహమ్॥ 16

తా॥ మాయయొక్క మోహమువలన అజ్ఞానులైన వారికందఱికిని నేను మిక్కిలి దుర్లభుడను. నావారై, వివేకము నొందినవారలకు ఎల్ల వేళల సులభుడను అగుదును.

శ్లో॥ అస్త్యేకస్సులభోపాయః
మాయాం తర్తుం సుదుర్గమాం।
అసంశయేన జానీహి
భక్తి రేవ సదామయి॥ 17

తా॥ మిక్కిలి దుర్గమమైన మాయను తరించుటకు సులభమైన ఉపాయ మొకటి కలదు. సర్వదా నాయందు భక్తి కలిగియుండుటయే అది యని నిస్సంశయముగా తెలిసికొనుము.

శ్లో॥ సర్వభీతిం సముత్సృజ్య
మామాశ్రిత్య సనాతనం।
సర్వదా సర్వకార్యేషు
సర్వధా విజయీ భవ॥ 18

తా॥ సమస్తమైనభీతిని విడచి సనాతనుడనైన నన్నాశ్రయించి, ఎల్లవేళల, సర్వకార్యములయందు సర్వవిధములుగా విజయమును పొందుము.

శ్లో॥ బాలం వృద్ధం యువానంచ
స్త్రియం శూద్రమపండితం।
ఆశ్రితా న్సకలా న్భక్తాన్
ఉద్ధరామి భవార్ణవాత్॥ 19

తా॥ బాలుని, వృద్ధుని, యువకుని, స్త్రీని, శూద్రుని, అపండితుని ఇత్యాదిగా ఆశ్రయించిన సర్వభక్తులను భవ సాగరమునుండి ఉద్ధరించెదను.

శ్లో॥ భక్తానుగ్రహకాలేషు
జాతిరూప కులాదిభిః।
ఉత్తమాధమ భేదస్తు
నగణ్యతే మయాధ్రువమ్॥ 20

తా॥ భక్తుల ననుగ్రహించు కాలములందు జాతి, రూపము, కులము మున్నగు వానిచేత కలిగిన ఉత్తమ అధమ భేదము నాచే గణింపనే బడదు. ఇది నిశ్చయము.

శ్లో॥ పశ్యన్నపి తథా శృణ్వన్
పాఠితోఽపి స్మరన్ పునః।
మత్తత్త్వం నాభి జానాతి
విభ్రష్టో మదనుగ్రహాత్॥ 21

తా॥ చూచుచు, వినుచు, చదివింపఁబడుచు మరల స్మరించుచుకూడ నాతత్త్వము నెఱుగలేనివాడు నా అనుగ్రహము నుండి విభ్రష్టుడగును.

శ్లో॥ సువిశ్వాస విహీనస్య
ద్వేషిణ స్సంశయాత్మనః।
అహంకార విమూఢస్య
దూరో భవామ్యహం సదా॥ 22

తా॥ చక్కని విశ్వాసములేని వానికిని, ద్వేషించు వానికిని, సంశయాత్మునకును, అహంకారము వలన విమూఢు డైన వానికిని నేను ఎల్లప్పుడును దూరమగుదును.

శ్లో॥ మద్భక్త్యాచ సమాయుక్తం
మహ్యాం విహ్వాలతాంగతం।
ప్రేమార్ద్ర హృదయం ధీరం
అనుగృహ్ణామి శీఘ్రతః॥ 23

తా॥ నాయందు భక్తితో నున్నవాడును, నాకొఱకై విహ్వాలతను పొందువాడును, ప్రేమార్ద్ర హృదయుడు నగుధీరుని శీఘ్రముగా అనుగ్రహించెదను.

శ్లో॥ తత్త్వం మమ పరిజ్ఞాతుం
అసమర్థః పుమానపి।
క్రమేణ లభతే జ్ఞానం
చింతయన్మామశంకితః॥ 24

తా॥ పురుషుడు నాయొక్క తత్త్వము నెఱుగుటకు సమర్థుడైనప్పటికి, శంకలనువీడి నన్ను చింతించుచు క్రమముగా జ్ఞానమును పొందును.

శ్లో॥ అకృత్వా సుకృతం కించిత్
దుష్కృతం కృతవానపి।
క్షిప్రం భవతి శుద్ధాత్మా
హ్యచ్యుతం మాం స్మరన్ సదా॥ 25

తా॥ సుకృతము ఏకొంచెము చేయకున్నప్పటికిని పాపమును ఒనర్చినవాడైనను పురుషుడు అచ్యుతుడనైన నన్ను సర్వదా స్మరించుచు నిశ్చయముగా శుద్ధాత్ముడు కాగలడు.

శ్లో॥ నమేభక్తస్య నాశోఽస్తి
న చ దుఃఖం భయం తథా।
నిశ్చయేన విజానీహి
నిత్యముక్తో భవిష్యసి॥ 26

తా॥ నాభక్తునకు నాశము, దుఃఖము, భయము అనునవి లేవు. అని నిశ్చయముగా తెలిసికొనుము, నిత్యముక్తుడవు కాగలవు.

శ్లో॥ యథా యస్యాస్తి సంస్కారో
భజతే మాం తథైవ సః॥
తస్య భ క్త్యనుసారేణ
ప్రయచ్ఛామి ఫలం సదా॥ 27

తా॥ ఎవని సంస్కారమెట్టిదో ఆతీరున నన్ను వాడు భజించును. వానియొక్క భక్తి ననుసరించి నే నెల్లప్పుడును ఫలము నొసగెదను.

శ్లో॥ విద్ధి త్వయి చ సర్వస్మిన్
అహమేవాస్మి కేవలః॥
సర్వత్రేదం సదాఽస్మృత్వా
సర్వభూత ప్రియో భవ॥ 28

తా॥ నీయందును సమస్తమునందునుకేవలము నేనే యున్నానని తెలిసికొనుము. దీనిని సర్వదేశముల సర్వవేళల స్మరించుచు సర్వభూతములకు ప్రియుడవుకమ్ము.

ఇతి శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవతః కృతౌ
శ్రీమద్భగవద్భారత్యాం అధ్యాత్మవిద్యాయాం
తృ తీ యోఽధ్యాయః

ఇది శ్రీవిశ్వగురు శ్రీమద్విద్యారణ్యభగవత్కృతియగు
శ్రీమద్భగవద్భారతియను అధ్యాత్మవిద్యయందు
తృతీయాధ్యాయము

# ॥श्रीमद्भगवद्भारती॥

# శ్రీమద్భగవద్భారతీ

## చతుర్థోఽధ్యాయః

శ్లో॥ యం యోగం సముపాస్థాయ
ప్రాప్స్యసి త్వం పదం మమ।
తం వక్ష్యే శృణు గూఢం తే
భజతే మాం పరాత్పరమ్॥ 1

తా॥ ఏ యోగమునను‌ష్ఠించి నీవు నాయొక్క పదమును పొందగలవో అట్టి రహస్యమైనదానిని పరాత్పరుడనగు నన్ను సేవించెడు నీకొఱకు (అనగా నా భక్తుడవగు నీకు) చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ యస్యైవాస్తి స్థిరా భక్తి
ర్మయి దేవే జగత్పతౌ।
నాస్తికించిద్భయం తస్య
మహామృత్యు సముద్భవమ్॥ 2

తా॥ జగన్నాథుడను, దేవుడనైన నాయందు ఎవనికి స్థిరమైన భక్తి ఉండునో అట్టివానికి ఘోరమైన మృత్యువు వలన కలిగెడు మహాభయముకూడ లేశమైనను కలుగదు.

శ్లో॥ రక్షామి క్షిప్రమేవాహం
తిష్ఠన్తం మత్పరాయణమ్।
దృఢభక్తిం సదా(శిత్య
హిత్వాన్యత్సాధనాంతరమ్॥ 3

తా॥ ఎల్లప్పుడు దృఢమైన భక్తి నా(శయించి మరియొక సాధనము నా(శయింపక నాయందు (శద్ధకలిగియుండు వానిని వెను వెంటనే రక్షించెదను.

శ్లో॥ మనసా కర్మణా వాచా
స్మరన్తం మాం మదా(శయమ్।
సదానుగమనం కృత్వా
తారయామి భవార్ణవమ్॥ 4

తా॥ మనసుచేతను, కర్మచేతను, వాక్కులతోడను నన్ను స్మరించుచు నన్నా(శయించిన వానిని ఎల్లప్పుడు వెంటనంటియుండి భవసాగరము నుండి తరింపఁజేయుదును.

శ్లో॥ అనన్యభావనాం లబ్ధ్వా
చింతయన్మాం నిరంతరమ్।
సన్న్యస్త సర్వసంకల్పో
హ్యా(త(బహ్మ సమశ్నుతే॥ 5

తా॥ అనన్యమైన భావనను పొంది, నిరంతరము నన్ను చింతించెడువాడు సర్వసంకల్పములను సన్న్యసించి యిహలోకముననే పరమాత్మను పొందును.

శ్లో॥ సన్నికృష్టోస్మి సంస్మారాత్
విస్మారాద్య ద్విదూరగః॥
విహాయ విస్మృతిం తస్మాత్
స్మరణం మే సదా కురు॥ 6

తా॥ నన్ను స్మరించువానికి నేను మిక్కిలి దగ్గరగుదును. మఱచిన వానికి మిక్కిలి దూరముగా నుందును అందువలన మరపునువిడచి ఎల్లవేళల నాస్మరణమునే చేయుము.

శ్లో॥ అసచ్చింతా ముపాశ్రిత్య
నరోఽనర్థముపాగతః॥
చిత్త మాత్మని సంస్థాప్య
చింతామన్యాం త్యజేత్సుధీః॥ 7

తా॥ మానవుడు అసచ్చింతలను (అనిత్యభావములను) ఆశ్రయించి కీడు నొందుచున్నాడు. బుద్ధిమంతుఁడు మనస్సును ఆత్మయందు లగ్నము చేసి అన్యవిచారములనుత్యజింపవలయును.

శ్లో॥ ఇంద్రియాణి ప్రమాథీని
ప్రజ్ఞావన్నపి ధీమతః॥
వంచన్త్యపి బుధంతాని
జాగర్యాయాం ప్రమాదినమ్॥ 8

తా॥ ఓ ప్రజ్ఞావంతుడా! ధీమంతునికైనను ఇంద్రియములు ప్రమాదమును కల్గించునట్టివిగానే యుండును. పండితునైనను, మెలకువగల వానైనను ఏమఱుపాటు నొందిన వానినికూడ ఆ ఇంద్రియములు మోసగించుచున్నవి.

శ్లో॥ కుర్వాణోఽపి సదాయత్న
మింద్రియవ్రాత నిగ్రహే।
నస సిద్ధి మవాప్నోతి
హ్యకృతాత్మా విమూఢధీః॥ 9

తా॥ ఇంద్రియ సమూహ (వ్యాపార) ముల నరికట్టుటకు ఎల్ల వేళల ప్రయత్నము చేయుచున్నవాడైనను. శాస్త్రాచార్యోపదేశములచేత సంస్కరింపబడని విమూఢాత్ముడు సిద్ధిని పొందకున్నాడు.

శ్లో॥ అయమేకస్తవో పాయః
జితౌహీంద్రియ సంహతేః॥
సుపౌరుషం సమాశ్రిత్య
మయ్యర్పిత మనాభవః 10

తా॥ దృఢమైన పురుషకారము నవలంబించి నాయందు మనస్సు నర్పణచేయుము. ఇంద్రియములను నిగ్రహించుటకు నీకిది యొక్కటియే జయోపాయము.

శ్లో॥ యదా భవతి మద్భక్తో
విషయై ర్మోహితస్తదా।
భూయస్తం మత్స్మృతిందత్వా
సత్పథేస్థాపయామ్యహమ్॥ 11

తా॥ నాభక్తుడు బలీయములగు విషయములచే మోహితుడై నపుడు, మరల నాతనికి నాస్మృతినికలిగించి సన్మార్గమున స్థాపించెదను.

శ్లో॥ స్త్రీభిరాలింగ్యమానోఽపి
విహరన్నపి సర్వదా।
హసన్ క్రీడన్ రమన్ జ్ఞానీ
వ్యామోహం స న గచ్ఛతి॥ 12

తా॥ జ్ఞానవంతుఁడు స్త్రీలచే నాలింగనము చేయఁబడు చున్నను, సదావిహరించుచున్నను, నవ్వుచున్నను, క్రీడించు చున్నవాడైనను వ్యామోహమును బొందడు.

శ్లో॥ కామజః క్రోధజో వేగః
తథా లోభ సముద్భవః।
క్షణికో దైర్ఘిక శ్చేతి
ద్వివిధః పరికీర్త్యతే॥ 13

తా॥ కామము, క్రోధము, లోభము అను వానివలన జనించిన వేగము (అనగా వికారము) క్షణికము (క్షణకాలముండునది) దైర్ఘికము (చాలకాలముండునది) అని రెండు విధములుగాఁ జెప్పబడుచున్నది.

శ్లో॥ క్షణికోఽనవధానాచ్చ
సత్యం హి మహితాత్మనామ్।
అనాదివాసనా కార్యాత్
దీర్ఘవేగో దురాత్మనామ్॥ 14

తా॥ మహితాత్ములకు అశ్రద్ధవలన క్షణికమైన వేగము సముద్భవమగును. దురాత్ములకు అనాదివాసనల ప్రేరణలచే దీర్ఘమైన వేగము జనించును.

శ్లో॥ కామేన బధ్యతే జంతుః
నిష్కామస్తు విముచ్యతే।
కామనా మఖిలాం త్యక్త్వా
నైష్కర్మ్య సుఖమశ్నుతే॥ 15

తా॥ జంతువు (ప్రాణి) కామముచేత బంధింపఁబడును. కోరికలు లేకుండటచే విముక్తిని పొందును. కావున సమస్తమైన కామమును విడనాడి ప్రాణి కర్తవ్యరాహిత్య సుఖము ననుభవించును.

శ్లో॥ ప్రజ్ఞావానపి శాస్త్రజ్ఞః
సంగమోహేన వంచ్యతే।
అసంగ దృఢ శస్త్రేణ
మోహపాశాన్నికృంతయ॥ 16

తా॥ ప్రజ్ఞావంతుడైన శాస్త్రజ్ఞుడు కూడ సంగమువలన కలిగెడు మోహముచేత వంచింపఁబడుచున్నాడు. నిస్సంగమనెడు దృఢమైన శస్త్రముచేత మోహమనెడు పాశములను ఛేదింపుము.

శ్లో॥ కామక్రోధౌ జితౌ యేన
మోహరాగౌ వివర్జితౌ।
జగత్సర్వం జితం తేన
నాసౌ కేనాపి బాధ్యతే॥ 17

తా॥ ఎవడు కామ, క్రోధములను జయించునో మోహ, రాగములను విసర్జించునో అట్టివానిచే లోకమంతయు జయింపబడినదగును. అతడు దేనివలనను బాధింపఁబడడు.

శ్లో॥ త్యక్తాహంకారరాగా యే
మద్భక్తా విగతాశయాః।
వారయామి చ్యుతిం తేషాం
బాహ్యాభ్యంతర కారణైః॥ 18

తా॥ ఎవ్వరు అహంకారమును, రాగమును (అనగా మమకారమును) పరిత్యజించిన వారై ఇతరాశయములు తొలగినవారై నాభక్తులగుదురో, అట్టివారియొక్క అంతరంగిక బాహ్యకారణముల చేనైన పతనమును నేను నివారించెదను.

శ్లో॥ మా మీశ్వరం నిరాకృత్య
యే వర్తంతే దురాశయాః।
అసాధూం స్తాన్విమూఢాంశ్చ
నరకేషు క్షిపామ్యహమ్॥ 19

తా॥ ఈశ్వరుఁడనగు నన్ను నిరాకరించి దుష్టమైన ఆశయములు కలవారై చరించు, అసాధువులగు మూఢమతులను నరకలోకములో పారవైతును

శ్లో॥ ఈశ్వరం గురు మాత్మానం
యే మాం భజ న్తి సర్వశః।
తర న్తీ హైవ మృత్యుం తే
మనిషా మత్పరాయణాః॥ 20

తా॥ ఈశ్వరుఁడను, గురుఁడను, పరమాత్ముండను అగు నన్ను అన్ని విధముల ఎవరు భజింతురో, అట్టివారు నాయందు నిష్ఠయు, తత్పరతయు కలవారై యీలోకముననే, మృత్యువును తరింతురు.

శ్లో॥ మత్ప్రేమతో௨నిశం శుద్ధః
యో మాం భజతి తత్త్వవిత్।
తమనన్యాశ్రయం ధీరం
మోక్షయిష్యామి బంధతః॥ 21

తా॥ శుద్ధుడై తత్త్వమునెఱిగినవాడై ప్రేమతో ప్రతిదినము నన్ను భజించుచు ఇతరాశ్రయములు లేనిధీరుని, (సంసార) బంధము నుండి విముక్తుని జేసెదను.

శ్లో॥ నానావిధ మతస్థానాం
సర్వేషాం ప్రాణినామపి।
ఏక ఏవాస్మ్యహం గమ్యః
పయసామర్ణవో యథా॥ 22

తా॥ నానావిధములైన మతముల నవలంబించువారగు సర్వ ప్రాణులకును, సర్వజలములకు సముద్రమువలె నేనొక్కడనే పొందదగినవాడను.

శ్లో॥ ఆర్తానాం బాధితానాం చ
పతితానాం నృణామపి।
దీనానాం చ సుఖీతానాం
అగతీనామహం గతిః॥ 23

తా॥ (రోగాదులచే) దుఃఖితులగువారికి, (దుర్జనులచే) పీడింపబడినవారికి, (నిగ్రహమును కోల్పోయి) పతితులగు మానవులకును (అనగా శీలము చెడినవారికిని), (దారిద్ర్యాదులచే)

దీనులైనవారికి, (మరణాదులవలన) భయపడినవారికి, దిక్కులేనివారికి నేనే శరణ్యుఁడనగుచున్నాను. (అనగా నేనే ఆశ్రయింపదగిన వాడనగుచున్నాను.)

శ్లో॥ దుస్సహేష్వపి దుఃఖేషు
సుభక్తిం మయి మా త్యజ।
సంతీర్య సర్వదుఃఖాని
మామేవైష్యసి మా శుచః॥ 24

తా॥ సహింపరాని మిక్కుటములైన దుఃఖములయందును నాయందలి దృఢ భక్తిని విడువకుము. సమస్త దుఃఖములను సంతరించి (దాటినవాడవై) నన్నేపొందగలవు. కనుక దుఃఖింపకుము.

శ్లో॥ సకృత్స్మరణ మాత్రేణ
సన్నికృష్టో భవామ్యహమ్।
అభయం తస్య దాస్యామి
శ్రియం ముక్తించ శాశ్వతీమ్॥ 25

తా॥ నన్నొక్కమారు స్మరించినమాత్రమున అట్టివానికి సన్నిహితుఁడనగుదును. వానికి అభయమను సంపదను శాశ్వతమైన ముక్తిని ఈయగలను.

శ్లో॥ మత్కర్మణా చ మద్భక్త్యా
శుద్ధిం లబ్ధ్వాత్మనః పరామ్।
నిర్మమో నిరహంకారీ
మద్ధ్యానేన విముచ్యతే॥ 26

తా॥ మానవుడు నన్ను గురించిన కర్మలు చేయుటచేతను నాయందలి భక్తితోడను ఉత్కృష్టమైన ఆత్మశుద్ధిని పొంది అహంకార మమకారములు తొలగినవాడై నన్ను గురించిన జ్ఞానముచేత ముక్తిని పొందుచున్నాడు.

శ్లో॥ అదత్వావసరం కించిత్
కామాదీనాం మదాశ్రయః।
ఆసుప్తే రామృతేః కాలం
నయేద్భక్త్యా మదర్థయా॥ 27

తా॥ నన్నాశ్రయించినవాడు (అనగా నాభక్తుడైనవాడు) కామము మొదలగువానికి కొంచమైనను అవకాశమీయక (ప్రతిదినము) నిద్రావస్థను చెందునంతవరకును (అనగా మెలకువకలిగి యున్నంత వరకును) మరణ పర్యంతమును (అనగా యావజ్జీవమును) అగు కాలమును నాకొఱకైన భక్తితో గడుపవలయును.

శ్లో॥ దుర్విజ్ఞేయం చ మే తత్త్వం
తార్కికాణాం శృతిద్విషామ్।
అశాంతచేతసాం చాపి
కామరాగాది దుర్గుణైః॥ 28

తా॥ కామరాగాది దుర్గుణములచేత అశాంతమైన మనస్సుకల వారికిని, వేద విరోధులగువారికిని, కుతార్కికులకును నాతత్త్వము తెలిసికొనరానిదగును.

శ్లో॥ మదంతస్థాని భూతాని
సర్వంచేదం మయా తతమ్।
లభ్యోఽస్మ్యహం పరస్సౌమ్య
జ్ఞాన భక్త్యా త్వనన్యయా॥ 29

తా॥ ఓ సౌమ్యుడా! సర్వభూతములు నాయందేకలవు. నాచే సర్వము వ్యాప్తమైనది. శ్రేష్ఠుడనగు నేను జ్ఞానముతో కూడిన అనన్యమైన భక్తితో లభ్యుడనగుచున్నాను.

శ్లో॥ మమానుగ్రహ నిర్భిన్న
హృదయగ్రంధి రాత్మవిత్।
స్వాత్మత్వేన జగద్దృష్ట్వా
తతో న విజుగుప్సతే॥ 30

తా॥ నాయొక్క అనుగ్రహముచేత భేదింపబడిన హృదయ గ్రంథులు (ముడులు) కలిగిన ఆత్మవేత్త, జగత్తును తన ఆత్మ స్వరూపముగాచూచి జుగుప్సను (అసహ్యమును) పొందడు.

శ్లో॥ మత్తత్త్వే నిర్వికల్పేయః
శ్రద్ధావాన్ సుసమాహితః।
సిద్ధో భవత్యయత్నేన
ముక్తి స్తస్య చ శాశ్వతీ॥ 31

తా॥ ఎవడు వికల్పరహితమైన నాతత్త్వమునందు శ్రద్ధావంతుడై మనస్సును మిక్కిలి ఏకాగ్రముచేయుచున్నాడో అట్టివాడు

ప్రయత్నము లేకుండగనే సిద్ధుడగుచున్నాడు. మరియు శాశ్వతమగు ముక్తిని పొందుచున్నాడు.

శ్లో॥ బహు జన్మకృతానంత
పుణ్యకర్మ ఫలోదయాత్।
జ్ఞాత్వామాం తత్త్వతస్త్యాగీ
మద్భావం ప్రతిపద్యతే॥ 32

తా॥ అనేక జన్మలలో చేసిన అనంతములైన పుణ్యకర్మముల యొక్క ఫలము ప్రారంభమగుటవలన త్యాగియై తాత్త్విక బుద్ధితో నన్ను తెలిసికొని నాభావమును పొందును. (అనగా బ్రహ్మ భావమును పొందును)

*ఇతి శ్రీ విశ్వగురు శ్రీ మద్విద్యారణ్య భగవతః*
*కృతౌ శ్రీ మద్భగవద్భారత్యాం ఆధ్యాత్మ*
*విద్యాయాం చతుర్థోఽధ్యాయః*

*ఇది శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవత్కృతి*
*యగు శ్రీమద్భగవద్భారతియను ఆధ్యాత్మవిద్య యందు*
*చతుర్థాధ్యాయము.*

## ।।श्रीमद्भगवद्भारती ।।

## శ్రీమద్భగవద్భారతీ

### పంచమోఽధ్యాయః

శ్లో॥ జగ త్తత్త్వం ప్రవక్ష్యామి
జానీహ్యేతత్ సుబుద్ధిమన్।
దుస్సహ ద్వంద్వసంయుక్తం
అధ్రువంచ భ్రమాలయమ్॥ 1

తా॥ (నేను) ఓ బుద్ధిమంతుడా! జగత్తుయొక్క స్వభావమును చెప్పబోవు చున్నాను తెలిసికొనుము. (ఈ ప్రపంచము) సహింపశక్యముకాని (శీతోష్ణ సుఖదుఃఖములనెడి) జంటలతో కూడినదై, శాశ్వతముకానిదై, సకలభ్రాంతికి నిలయమై యున్నది.

శ్లో॥ వృథా భ్రమసి విశ్వేస్మిన్
అజ్ఞాత్వా తత్త్వమవ్యయమ్।
ధ్రువానందం ప్రదాస్యామి
మయి భక్తిం స్థిరాం కురు॥ 2

తా॥ అవ్యయమైన తత్త్వమునెఱుఁగక ఈ ప్రపంచమున వ్యర్థముగా భ్రమించుచున్నావు. నాయందు స్థిరమైన భక్తి నుంచుము. ధ్రువమైన ఆనందమునిచ్చెదను.

శ్లో॥ బాహ్యాడంబర వేషైశ్చ
భ్రామకైర్వచనై స్తథా।
సకృత్రిమ క్రియాభిస్తు
నలభ్యోఽహం పరోహరిః॥ 3

తా॥ పరాత్పరుడనైన హరినగునేను బాహ్యములైన ఆడంబర వేషములచేతను, (చిత్తవును) భ్రమింపజేయుమాటలచేతను, కృత్రిమములైన (అనగా కపటముతో కూడిన) పనులచేతను పొందబడను.

శ్లో॥ మోహగ్రహాద్విముక్తస్తు
నిత్యానిత్య వివేకవాన్।
నిత్యానంద స్సదాశాంతః
జ్ఞానీ జయతి సర్వదా॥ 4

తా॥ మోహమనెడు గ్రహమునుండి విముక్తుడైనవాడును, నిత్యానిత్యవివేకముకలవాడును, నిత్యానంద స్వరూపుడును, ఎల్లప్పుడు శాంతుడును అగుజ్ఞాని సర్వదా విజయమును పొందును.

శ్లో॥ విషయస్యతు సాన్నిధ్యాత్
ధ్యానం తస్మిన్నవిష్యతి।
ధ్యానాద్ధి విషయాసంగః
తతోఽనర్థ పరంపరా॥ 5

తా॥ విషయవస్తువులయొక్క సమీపమునందుండుట వలన దానియందు మానవునకు ధ్యానమేర్పడును. ధ్యానము వలననే విషయము యందు ప్రీతి యేర్పడును. దానివలన అనర్థములు పరంపరగా నేర్పడును.

శ్లో॥ శ్రవణం దర్శనంచైవ
స్పర్శనం స్మరణం తథా।
విషయాణాం ధ్రువం సత్యం
ఏకైక మపి హానిదమ్॥ 6

తా॥ విషయవస్తువులను వినుట, చూచుట, తాకుట, స్మరించుట - వీనిలో నేయొక్కటియైనను హానినే కలిగించును ఇది సత్యము. ధ్రువము.

శ్లో॥ తస్మాత్సర్వ ప్రయత్నేన
విషయాన్దూరత స్త్యజ।
సర్వభ్రాంతేశ్చ వక్ష్యేఽహం
అవిద్యైవహి కారణమ్॥ 7

తా॥ అందువలన సర్వవిధములైన ప్రయత్నములతో విషయములను దూరముగాత్యజింపుము, సర్వభ్రాంతికిని అజ్ఞానమే కారణము.

శ్లో॥ క్రీడాభిర్వంచితా బాలాః
యువానో వనితా హతాః।
జరయా పీడితా వృద్ధాః
సర్వే నష్టాస్తుమాయయా॥ 8

తా॥ బాలురు ఆటలచే వంచితులగుదురు. యువకులు స్త్రీలచే హతులగుదురు. వృద్ధులు వార్థక్యముచే పీడితులగుదురు. సర్వులును మాయచే నశించుచున్నారు.

శ్లో॥ అవిద్యయా జడో నష్టః
స్వాహంకారేణ పండితః।
అశ్రద్ధయా చ యోగజ్ఞః
సర్వే నష్టాస్తు మాయయా॥ 9

తా॥ జడుడు (మందబుద్ధి కలవాడు) అవిద్యవలనను, పండితుఁడు అహంకారము చేతను, యోగజ్ఞుడు (అనగా యోగ తత్త్వము నెఱిగినవాడు) అశ్రద్ధచేతను, నష్టపడుచున్నారు. మాయవలన అందరు నశించుచున్నారు.

శ్లో॥ పరామర్శం పరిత్యజ్య
జ్వరార్తస్య పితుస్సుతః।
కాంతా శ్లేష సుఖాసక్తః
కస్యాయం క్వ కుమారకః॥ 10

తా॥ జ్వరముచే పీడితుడగు తండ్రియొక్క యోగక్షేమ విచారణను వదలిపెట్టి కుమారుడు కాంతాలింగన సౌఖ్యమునం దాసక్తుడగుచున్నాడు. అట్టివాడెవనికి ఎట్టికుమారుడగును?

శ్లో॥ ధర్మాధర్మా న్పరిత్యజ్య
పోషితాపి స్వనార్యపి।
జరాక్రాంత మనాదృత్య
వర్తతే కిల కాసతీ॥ 11

తా॥ ధర్మాధర్మములను వదలిపెట్టి పోషింపబడిన తన భార్యయును, ముసలితనమున నడుగిడిన తనను ఆదరింపక తిరుగుచున్నది. ఇట్టిచో భార్యయనగా నెట్టిది?

శ్లో॥ రూప యౌవన లావణ్య
నృత్య గాన కళాదిభిః
సంపన్నాపి గతే కాలే
నారీ భవతి నిస్ప్రుహా॥ 12

తా॥ రూపమునందును, యౌవనమునందును, లావణ్యము నందును, నృత్యగాన కళాదులయందును సంపన్నురాలైనను కాలముగడువగా వనిత కాంతి విహీనురాలగును.

శ్లో॥ నార్యాః కపోల ఫాలోష్ఠ
శ్రోత్రాక్షి స్త న రమ్యతా।
నా భ్యూరు జఘన శ్రోణీ
సౌందర్యం నైవ శాశ్వతమ్॥ 13

తా॥ స్త్రీయొక్క చెక్కిలి, ఫాలము, అధరము (పెదవులు) చెవి, కన్ను, స్తనములు అనువాని రమ్యతయును, నాభి, ఊరువులు, పిరుదులు, కంఠము అనువాని సౌందర్యమును శాశ్వతము కానేకాదు.

శ్లో॥ సుఖ కర్యపి నారీ సా
దుఃఖమంతే ప్రయచ్ఛతి।
అవిచార్య నరో భ్రాంతః
ఆపత్స్వేవ పతత్యహో॥ 14

తా॥ తాత్కాలికముగా ఇంతి (స్త్రీ) సుఖమును కలిగించినను అంతమున దుఃఖమునే కలిగించును. నరుఁడు భ్రాంతుడై విచారింపక అహో! ఆపదలలోనే పడుచున్నాడు.

శ్లో॥ భార్యాపుత్ర సుహృద్బంధు
ప్రజానాంహి నృపస్యచ।
కారణం వైరభావస్య
కిం క్వార్థ స్సుఖసాధనమ్॥ 15

తా॥ భార్యకు, కుమారునకు, ప్రజలకు, ప్రభువునకును విరోధభావమునకు కారణమగు ధనము ఎచట ఎట్టి సుఖ సాధనము? (అనగా ధనము సుఖసాధనముకాదనుట)

శ్లో॥ బలాధికం సమాదృత్య
బలహీనం నపశ్యతి।
లోకోయం హి వ్యధాకారీ
మోహకారీ చ తత్త్వతః॥ 16

తా॥ ఈలోకము బలముచే నధికుడైన వానిని మిక్కిలి యాదరించి బలహీనుని తిరస్కరించుచున్నది. మరియు వాస్తవముగా దుఃఖకరమును, మోహమును కలిగించునట్టిదియునైయున్నది.

శ్లో॥ పునర్భవః పునర్మృత్యుః
పునర్హనిః పునర్జరా।
తస్మాద్వదతి విజ్ఞానీ
''సునిస్సార మిదంజగత్''॥ 17

తా॥ మానవునకుఁ బుట్టుక, చావు, మరలపుట్టుక ముసలితనము అనునవి చర్విత చర్వణములగుచున్నవి. అందువలననే విజ్ఞాన వంతుడు ఈజగత్తు మిక్కిలి నిస్సారమైనదనును.

శ్లో॥ శబ్దం స్పర్శం చ రూపంచ
రస గంధౌ సమా శ్రితః।
అవిచార్య పరం తత్త్వం
సౌఖ్యమాప్తుం ప్రవర్తతే॥ 18

తా॥ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడు పాంచ భౌతిక గుణములను ఆశ్రయించిన మానవుడు పరతత్త్వమును విచారింపక సుఖమును పొందుటకు ప్రయత్నించుచున్నాడు.

శ్లో॥ నిత్యమాపూర్యమాణో౽పి
దీర్ఘకాలం ప్రయత్నతః।
న భవిష్యతి కామాంతః
తృష్ణా గర్తో న పూర్యతే॥ 19

తా॥ దీర్ఘ కాలము ప్రయత్నపూర్వకముగా ప్రతిదినము నింపబడుచున్నప్పటికిని ఆశల నెడు యగాధము (మిక్కిలి లోతైన పల్లప్రదేశము) పూరింపబడదు. కోరికలకును అంతముకలుగనేరదు.

శ్లో॥ దూరాదేవ సురమ్యాచ
క్షణమేవ సుఖప్రదా।
విచారే సారహీనా సా
నారీ త్యాజ్యా మనీషిభిః॥ 20

తా॥ దూరమునుండి మాత్రమే సుందరమైనదియు, క్షణకాలమే సుఖము నిచ్చునదియు విచారింపగా సారము లేనిదియునగు స్త్రీని బుద్ధిమంతులు పరిత్యజింపవలెను.

శ్లో॥ జిహ్వోపస్థ సుఖభ్రాంత్యా
సంచరం త్యవివేకినః।
లబ్ధ్వా௨గ్రే ௨ల్పం క్షణం సౌఖ్యం
పశ్చా ద్యాప న్తి దుఃఖినః॥ 21

తా॥ అవివేకులు జిహ్వోపస్థల (రసనేంద్రియ, జననేంద్రియ) సుఖభ్రాంతిలో సంచరించుచున్నారు. అందువలన ముందు అల్పమైనట్టియు, క్షణికమైనట్టియు సౌఖ్యమును పొంది పిమ్మట దుఃఖమును పొందుచున్నారు.

శ్లో॥ దుష్పూర కామవేగేన
పండితో௨పి సుశిక్షితః।
కార్యాకార్యం న జానాతి
దుఃఖం ప్రజతి మూఢధీః॥ 22

తా॥ పూరించుటకు శక్యముకాని కామ వేగమువలన మిక్కిలి శిక్షణ కలిగిన పండితుఁడుకూడ ఇది చేయఁదగినది, ఇది చేయరానిది యను విషయమును తెలిసికొనలేకున్నాడు. మూఢబుద్ధియై దుఃఖమును పొందుచున్నాడు.

శ్లో॥ సాధనేచ మహద్దుఃఖం
భోగకాలే భయాన్వితమ్।
భోగాంతే చ పునర్దుఃఖం
విషయం విద్ధి బుద్ధిమన్॥ 23

తా॥ ఓ బుద్ధిమంతుడా! విషయసుఖమును, సాధించు కాలమున మిక్కిలి దుఃఖమును కలిగించునదిగను అనుభవించు

కాలమున భయమును కలుగజేయునదిగను, అనుభవాంతమున మరల దుఃఖమును కలిగించునదిగను తెలిసికొనుము.

శ్లో॥ వైరాగ్య తారతమ్యేణ
సిద్ధిం గచ్ఛతి సాధకః।
యదిస్యాత్తీవ్రవైరాగ్యం
క్షిప్రం భవతి త త్త్వవిత్॥ 24

తా॥ సాధకుడు వైరాగ్యమునందలి తారతమ్యమువలన సిద్ధిని పొందుచున్నాడు. తీవ్రమైన వైరాగ్యము కలిగినచో వేగముగా తత్త్వవేత్త యగుచున్నాడు.

శ్లో॥ మాతా పితా సుతో మిత్రం
బాంధవా స్తేఽ రయోధ్రువమ్।
పరమార్థ పద ప్రాప్తౌ
నోపకుర్వంతియే జనాః॥ 25

తా॥ తల్లి, తండ్రి, కుమారుడు, స్నేహితుడు, బంధువులునగు యేజనులు పరమార్థపదమును పొందుటకు సహకారము నొనరించుట లేదో అట్టివారు నిశ్చయముగా నీకు శత్రువులే.

శ్లో॥ విత్తచింతా విహీనస్య
కాంతా సౌఖ్యవిరాగిణః।
పుత్ర్త మోహ విముక్తస్య
శాంతి ర్భవతి శాశ్వతీ। 26

తా॥ ధనచింత లేనివానికిని, కాంతా సౌఖ్యమున విరాగియైన వానికిని, పుత్రమోహమునుండి విడివడినవానికిని శాశ్వతమైన శాంతి లభించును.

శ్లో॥ గృహబంధ విముక్తస్తు
బంధుసంగ విదూరగః॥
జాతిగర్వ పరిత్యాగీ
సౌఖ్యమాప్నోతి కేవలమ్॥ 27

తా॥ గృహబంధమునుండి విముక్తుడైనవాడును, బంధు సంగము నుండి దూరముగా తొలగినవాడును, జాతిగర్వమును పరిత్యజించినవాడును, కేవలము సౌఖ్యమునే పొందును.

శ్లో॥ ఇష్టా నిష్ట పరిత్యాగీ
స్నేహ ద్వేష వివర్జితః॥
రమ్యారమ్య వియుక్తశ్చ
పరం సౌఖ్యం సమశ్నుతే॥ 28

తా॥ ఇష్టానిష్టములను పరిత్యజించినవాఁడును స్నేహ ద్వేషములను విసర్జించినవాఁడును రమ్యారమ్యముల నుండి విడుదల నొందినవాడును, శ్రేష్ఠమైన సౌఖ్యము ననుభవించును.

శ్లో॥ పరాందేవీ మవిజ్ఞాయ
మానుషీం తను మాశ్రితామ్।
భోగ్యామి వేహ పశ్యంతి
నరకాయైవ మోహతః॥ 29

తా॥ మానవులు, మానుష శరీరము నాశ్రయించిన శ్రీని, పర దేవిగా తెలిసికొనజాలక మోహమువలన భోగ్య వస్తువుగా చూచు చున్నారు. ఇది కేవలమునరకమునే కలిగించును.

శ్లో॥ మాయా కల్పిత విశ్వేఽస్మిన్
పశ్యంశ్చిత్రాణ్య నేకశః।
ఆశ్చర్య భయరాగాదీన్
మద్జ్ఞా నీ నాధిగచ్ఛతి॥ 30

తా॥ మాయాకల్పితమగు ఈ ప్రపంచమునందు అనేక విధములగు చిత్రములను చూచుచూ, నాజ్ఞానముగల వివేకి ఆశ్చర్యము, భయము, రాగము మున్నగువానిని పొందడు.

శ్లో॥ మనసాను భవన్భోగాన్
బహిర్దృష్ట్యా సునిశ్చలః।
యస్తిష్ఠతి స మాయావీ
స్వర్గేచేహ నిరాకృతః॥ 31

తా॥ ఎవడు మనస్సుతో భోగములననుభవించుచూ బాహ్యదృష్టికి నిర్వికారునివలెనుండునో అట్టి మాయావి ఇహ పరములు రెంటికి దూరుడగుచున్నాడు.

శ్లో॥ యా రక్తి ర్విషయేష్వేవం
యది స్యాన్మయి రక్షకే।
సర్వదుఃఖాతిగో భూత్వా
సర్వానంద మవాప్స్యసి॥ 32

తా॥ విషయసుఖములయందు గల రక్తి రక్షకుఁడనైన నాయందు ఆప్రకారము నీకున్నచో సర్వదుఃఖములను దాటిన వాడవై సర్వానందమును పొందగలవు.

శ్లో॥ జగద్భార హరం శౌరిం
సుజనావన దీక్షితమ్।
విశ్వాచార్యం త్రయీసారం
శ్రీహరిం మాం నమస్కురు॥ 33

తా॥ జగద్భారమును హరించువాడను, విష్ణువును, సుజన రక్షణమున దీక్షగలవాఁడను. విశ్వమున కాచార్యుడను. వేదాసారమును శ్రీహరినగు నన్ను (నాకు) నమస్కరింపుము.

శ్లో॥ మందప్రజ్ఞావతాం చాపి
లౌక్యాలోకన రాగిణామ్।
వైరాగ్యం చ మతిందాస్యే
యది మాం శరణంగతాః॥ 34

తా॥ మందప్రజ్ఞులకును (అనగా సూక్ష్మబుద్ధిలేనివారికిని) లౌకిక విషయముల పరికించుటయందు రక్తిగలవారికిని గూడ నన్ను శరణు పొందినయెడల సద్బుద్ధిని, వైరాగ్యమును ప్రసాదించగలను.

శ్లో॥ అకారణ దయాసింధుం
సుభక్త జనవత్సలమ్।
అనిశం మాం భజస్వత్వం
విశుద్ధ మతిగోచరమ్॥ 35

తా॥ నిర్వ్యాజమైన (కారణరహితమైన) దయకు సముద్రుఁడ నైన, భక్తజనులయందు వత్సలుడనైన, విశుద్ధమైన బుద్ధికి గోచరించువాడనైన నన్ను నిరంతరము భజింపుము.

శ్లో॥ అనీశ్వరో హ్యసర్వజ్ఞః
ఇతి మత్వా హ్యపండితాః।
న మాం భజన్తి దుశ్చిత్తాః
లీలోపాత్త నృదేహకమ్॥ 36

తా॥ విలాసముగా మానవ దేహమును ధరించిన నన్ను దుష్టబుద్ధులగు అపండితులు, ఈశ్వరుడుకాడనియు, సర్వజ్ఞుడు కాడనియు తలచి సేవింపరు.

శ్లో॥ ఆక్షిపన్నభ్యసూయంశ్చ
సంశయన్మామనాశ్రయన్।
అవజానన్నిరాకుర్వన్
నరో భ్రశ్యతి సౌఖ్యతః॥ 37

తా॥ నన్నాక్షేపించుచు, అసూయను పొందుచు ఆశ్రయింపకయు, సంశయించుచు, అవమానించుచు, నరుఁడు సౌఖ్యమునుండి భ్రష్టుడగుచున్నాడు.

శ్లో॥ త్వం తర్తుం మోహశోకాబ్ధిం
అగమో మే భవత్యహో।
సంశయానాశు సంత్యజ్య
సర్వేశ్వరం వ్రజస్వ మామ్॥ 38

తా॥ మోహశోక సాగరమును నీవు తరించుటకే నారాక, యైయున్నది. కావున శీఘ్రముగా సంశయముల నన్నిటిని త్యజించి సర్వేశ్వరుఁడనైన నన్ను పొందుము.

శ్లో॥ అవిద్యయా నరాః కేచిత్
ప్రీత్యా౽న్యే విషయేషు చ।
అన్యేభ్యశ్చ భయాత్కేచిత్
త్యక్త్వా మాం సంసరన్తివై॥ 39

తా॥ కొందరునరులు అజ్ఞానముచేతను, మఱికొందరు విషయములందలి ప్రీతిచేతను, వేఱుకొందరు ఇతరులవలన భయముచేతను, నన్ను వదలినవారై (జననమరణ రూప) సంసారమున తిరుగుచున్నారు.

శ్లో॥ మచ్చిత్తో మత్పరో నిత్యం
మయ్యర్పిత క్రియాఫలః।
శ్రద్ధావాననసూయశ్చ
సో౽మృతత్వాయ కల్పతే॥ 40

తా॥ నాయందు మనస్సు కలవాఁడును, నాయందు తత్పరత్వము కలవాఁడును, నాయందు క్రియాఫలములు అర్పించినవాఁడును, శ్రద్ధావంతుఁడును, అసూయారహితుఁడును అమృతత్వమును పొందుటకు సమర్థుడగుచున్నాడు.

శ్లో॥ నశ్వరే సుఖదూరేస్మిన్
లోకే ప్రాప్య మనుష్యతామ్।
విహాయ విషయోన్మాదం
భగవన్తం భజస్వమామ్॥ 41

తా॥ నాశన శీలవైనదియు, సుఖమునకు దూరమైనదియునగు ఈలోకమున (దుర్లభమైన) మనుష్యత్వమును పొందిన నీవు విషయోన్మాదమును (అనగా విషయ సుఖములందలి వ్యామోహమును) పరిత్యజించి భగవంతుఁడనైన నన్ను భజింపుము.

శ్లో॥ మద్భక్తో మద్గతప్రాణో
నిరాశీ ర్నియతేంద్రియః।
అంతరంగపతిం యుక్తో
ధ్యాయన్మాం మయివర్తతే॥ 42

తా॥ నాభక్తుఁడు, నాయందే ప్రాణములుకలవాడు, ఆశా విరహితుడు, ఇంద్రియనిగ్రహము కలవాడు యోగ్యుడు నైనవాడు, అంతరంగ పతినగు నన్ను ధ్యానించుచున్నావాడై నాయందే నివసించును.

ఇతి శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవతః కృతౌ
శ్రీమద్భగవద్భారత్యాం అధ్యాత్మవిద్యాయాం పంచమోఽధ్యాయః

ఇది శ్రీ విశ్వగురు శ్రీ మద్విద్యారణ్య భగవత్కృతి
యగు శ్రీ మద్భగవద్భారతియను తిధ్యాత్మవిద్య
యందు పంచమాధ్యాయము.

# ॥श्रीमद्भगवद्भारती॥

# శ్రీమద్భగవద్భారతీ

## షష్ఠోఽధ్యాయః

శ్లో॥ వైరాగ్య జ్ఞానయోగైర్హి
కైవల్యం లభతే పుమాన్।
తద్వైరాగ్యక్రమం వక్ష్యే
శృణుధీర! సుదుర్లభమ్॥ 1

తా॥ పురుషుడు వైరాగ్యజ్ఞానయోగముచేత మోక్షమును పొందుచున్నాడు. ఓ బుద్ధిమంతుడా! మిక్కిలి దుర్లభమైన అట్టి వైరాగ్య క్రమమును చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ అజ్ఞానీహ నరో మూఢః
దేహోఽహమితి మన్యతే।
తస్మాదహం మమేతీత్థం
భ్రాంతిమూలేషు వర్తతే॥ 2

తా॥ అజ్ఞానియు మూఢుడునైన నరుడు దేహమే నేనని తలచుచున్నాడు. అందువలన నేను, నాదిఅనెడు భ్రాంతి మూలక విషయములలో ప్రవర్తించుచున్నాడు.

శ్లో॥ కామినీ కాంచనంచైవ
పుత్ర క్షేత్ర గృహాదయః।
అధికారః ప్రతిష్ఠాచ
మానవం భ్రామయ న్తిహి॥ 3

తా॥ కాంతాకనకవములును, పుత్రక్షేత్రవములును గృహాదులును, లౌకికమైన అధికారము, ప్రతిష్ఠ అను నవియు మానవుని భ్రమింపఁ జేయుచున్నవి.

శ్లో॥ అంగశోభా సమాకృష్టో
యౌవనోద్రిక్త మానసః।
మోహసంఛన్న విజ్ఞానో
దేహరత్యాం ప్రవర్తతే॥ 4

తా॥ స్త్రీయొక్క శరీరశోభవలన మిక్కిలిగా ఆకర్షింపఁ బడినవాడును, యౌవనపుపొంగుతో ఉద్రిక్తమైన మనస్సు కలవాడును, మోహముచేత కప్పివేయబడిన విజ్ఞానముకలవాడును అగునరుడు దేహమునందలి ప్రీతితో ప్రవర్తించుచున్నాడు.

శ్లో॥ శరీరాంగ సువిన్యాసాన్
పశ్యన్భ్రమతి పామరః।
మాంసాస్థిరక్త సంపృక్తం
జ్ఞాత్వా జ్ఞానీన ముహ్యతి॥ 5

తా॥ శరీరావయవముల యొక్క భంగిమలనుగని పామరుడు అట్టిశరీరమే నిత్యమని భ్రమించుచున్నాడు, జ్ఞాని శరీరమును మాంసము ఎముకలు, రక్తములకూడికగా తెలిసికొని మోహమునందడు.

శ్లో॥ విలాసాలాప చేష్టాభిః
చిత్రాలంకార భూషణైః।
హావ భావ వినోదైశ్చ
నారీకర్షతి పూరుషమ్॥ 6

తా॥ విలాసములు, తియ్యనిపలుకులు, (బహువిధ) చేష్టలు, చిత్రవిచిత్రములైన ఆభరణ విశేషములు, హావభావ వినోదములు అనువానివలన అబల పురుషుని చిత్తమునాకర్షించుచున్నది.

శ్లో॥ సర్వశాస్త్ర వివేకాఢ్యః
బహుధానుభవాన్వితః।
తథాపి పురుషో యాతి
నారీం దృష్ట్వా విమోహితామ్॥ 7

తా॥ సర్వశాస్త్రవముల వివేకవముచే సంపన్నుడు, లోకానుభవము మిక్కిలిగా కలవాడును అగుపురుషుడుకూడ స్త్రీ దర్శనమువలన మోహము నొందుచున్నాడు.

శ్లో॥ కామోనామ కిరాతోఽయం
యమాదపి భయంకరః।
నష్టాస్తేన సునార్యశ్చ
యతయ శ్చాపి వంచితాః॥ 8

తా॥ కాముడను ఈ కిరాతుడు యమునికంటెను భయంకరుడు అతనిచేత శోభనశీలవతులగు స్త్రీలు నాశనము చేయబడిరి. (సంగపరిత్యాగమందు యత్నశీలురగు) యతులును వంచితులైరి.

శ్లో॥ బాలాపి తరుణీ చైవ
సా వృద్ధా ప్య బలాపిచ।
నారీ బంధకరీ త్వ్యుక్తా
శాస్త్రానుభవ పండితైః॥ 9

తా॥ అంగన బాలయైనను, యువతియైనను, వృద్ధురాలైనను, అబలయైనను, పురుషునికి ఐహికబంధమునే కల్గించునని శాస్త్రముల యందు అనుభవముగల పండితులు చెప్పుదురు.

శ్లో॥ ప్రియా విరహదుఃఖేన
దుస్స్నేహన సుచాలితః।
కర్తవ్య సంస్మృతిం త్యక్త్వా
దైన్య భావేన పీడ్యతే॥ 10

తా॥ మిక్కిలి దుస్సహమైన ప్రియురాలి ఎడబాటు వలన కలిగిన దుఃఖముచేత తీవ్రముగా కలతనొందిన మానవుడు కర్తవ్యస్మృతిని కోల్పోయి దైన్యభావముతో పీడింపబడుచున్నాడు.

శ్లో॥ చాల యన్తి మనస్థైర్యం
పురుషస్య స్త్రియో ధృవమ్।
హరోఽపిమోహినీం దృష్ట్వా
వ్యామోహం ప్రాప్తవాన్కిల॥ 11

తా॥ స్త్రీలు నిశ్చయముగా పురుషుని మనస్థైర్యమును చలింపజేయుదురు, (కామజేతయగు) పరమేశ్వరుడును మోహినీరూపమునుచూచి వ్యామోహమును పొందినాడట.

శ్లో॥ వేదా న్తినోఽపి దాన్తస్య
విదుష శ్చాపి యోగినః।
తరుణీ సహవాసేన
జ్ఞానబుద్ధి ర్వినశ్యతి॥ 12

తా॥ వేదాన్తజ్ఞానము కలవానికైనను, తపోవంతునకైనను, పండితునికైనను, యోగినిష్ఠితునకైనను యువతీ సహవాసమువలన జ్ఞానబుద్ధి సంపూర్ణముగా నశించును.

శ్లో॥ విద్వానపీహ శాస్త్రేషు
ప్రజ్ఞయాయోగిరాడపి।
శూరోపి యుద్ధ తంత్రేషు
నారీదాసో భవిష్యతి॥ 13

తా॥ (లౌకిక) శాస్త్రములందు విద్వాంసుడైనను, ప్రజ్ఞావంతుడైన యోగి శ్రేష్ఠుడైనను, యుద్ధతంత్రములందు శూరుడైనను (నిగ్రహబుద్ధి లేని యెడల) స్త్రీ దాసుఁడగును.

శ్లో॥ సంబుద్ధం జ్ఞానసంయుక్తం
నిర్మలంచాపి సంస్కృతం।
మనః కలుషతామేతి
స్త్రీ సంగత్యాద్ధ్రువంస్మర॥ 14

తా॥ (అజ్ఞానమనెడి నిద్రనుండి) మేల్కొలుపబడిన దైనప్పటికిని, మోక్షవిషయకబుద్ధితో కూడినదైనప్పటికిని, నిర్మలమైనప్పటికిని, (గురప్రబోధాదులచే) సంస్కరింపఁబడి నప్పటికిని మనస్సు స్త్రీ సాంగత్యముచేత కాలుష్యమును బొందును. ఇది నిశ్చయమని తలంపుము.

శ్లో॥ సహవాసాచ్చ సంపర్కాత్
కామినీనాంతు యోగినః।
భాషణాద్దర్శనాచ్చైవ
తపస్తేజో వినశ్యతి॥ 15

తా॥ కామినులయొక్క సహవాస సంపర్కముల వలనను, దర్శన సంభాషణాదుల వలనను, యోగమార్గ నిష్ఠితుల యొక్కయు తపశ్శక్తి నశించుచున్నది. (సామాన్యుల విషయము వేరే చెప్ప నేల?)

శ్లో॥ కవీనాం కల్పనాస్వేవ
రమ్యా భవతి కామినీ।
యథార్థే మాంస పిండేఽస్మిన్
న రమన్తి వివేకినః॥ 16

తా॥ కవులయొక్క కల్పనలయందు మాత్రమే కామిని రమణీయముగా కన్పట్టును. యదార్థమునకు మాంసపిండమైన యా స్త్రీ శరీరమునందు వివేచనా బుద్ధిగల పండితులకు రక్తి కలుగదు.

శ్లో॥ జాగరూకశ్చ విజ్ఞానీ
మాయాప్రభావ కోవిదః।
అనిచ్ఛన్నపి నరో భ్రాంతః
కాంతా స్నేహేన ముహ్యతి॥ 17

తా॥ (ఇంద్రియనిగ్రహమందు) జాగరూకుఁడును విజ్ఞానవంతుడును. మాయాప్రభావము నెఱుంగుటలో పండితుడును అగు మానవుడుకూడ, ఇచ్ఛలేని వాడయ్యును కాంత యందలి స్నేహమువలన భ్రాంతుడై మోహమునొందుచున్నాడు.

శ్లో॥ కాంతాసుదృఢవిశ్వాసం
నిధాయ రమతే పుమాన్।
చిత్రం స వంచిత స్తాభిః
దుఃఖం ప్రాప్నోతి దుర్భరమ్॥ 18

తా॥ (ప్రళయాంతకమైనబుద్ధిగల) కాంతలయందు మిక్కిలి దృఢమైన నమ్మకము కలుగజేసికొని పురుషుడు రమించుచున్నాడు. చిత్రముగా వారిచేతనే (ఆ కాంతలచేతనే,) వంచింపబడినవాడై భరింపశక్యము కాని దుఃఖమును పొందుచున్నాడు.

శ్లో॥ కామవేగో మహాం స్తీవ్రః
నిగ్రహ స్తస్య దుష్కరః।
నిరుద్ధోఽపి సముత్థాయ
ప్రజ్ఞాం హరతి యోగినః॥ 19

తా॥ కామ వేగము మిక్కిలి గొప్పది. అతితీవ్రమైనది. ఆవేగము నరికట్టుట అతిదుష్కరము, యోగి (అభ్యాసాధుల వలన) ఆవేగ తీవ్రత నరికట్టినప్పటికిని, మరల మరల విజృంభించినదై యాతని ప్రజ్ఞను హరించుచున్నది.

శ్లో॥ వచస్సై రచనాభిశ్చ
సర్వే జయంతి మన్మథమ్।
చింతస్సై శ్చైవ చర్యాభిః
సర్వే నమంతి మన్మథమ్॥ 20

తా॥ మానవులందఱు మాటలచేతను, కవితాధోరణుల చేతను మన్మథుని జయింతురు కాని ఆలోచనలతోను, ఆచరణలచేతను మాత్రము సర్వులును మన్మథునకు నమస్కరింతురు (అనగా కామమునకు లొంగిపోదురని భావము.)

శ్లో॥ కామం సంగోద్భవం విద్ధి
దుష్పూరం దురితాలయమ్।
సంసార కారణం ఘోరం
పాపరూపం మహాశనమ్॥ 21

తా॥ కామము విషయములందరి ప్రీతివలన జనించిన దనియు, పూరింపనలవి కానిదనియు, పాపములకు నిలయమైన దనియును, (మోక్షమును దూరీకరించు) సంసారమునకు కారణమైనదనియు, పాపరూపమైనదనియు, తృప్తి పరుపరానిదనియు నెఱుంగుము.

శ్లో॥ కామమూల మిమం విద్ధి
సంసారం దురతి క్రమమ్।
కాంతామూలం చ తంకామం
తస్మాత్కాంతాం త్యజేత్సుధీః॥ 22

తా॥ తరింపశక్యముకాని సంసారమునకు మూలకారణము కామమనియు, ఆకామమునకు మూలము కాంతయనియు గుర్తింపుము. అందువలన బుద్ధిమంతుడు కాంతావిషయరాగమును పరిత్యజింపవలెను.

శ్లో॥ యౌవనోల్లాస సంమూఢః
ఆరోగ్యబల గర్వితః।
యథేచ్ఛము పభోగేషు
స్వాయుర్నయతి పావనమ్॥ 23

తా॥ (క్షణికములైన) యౌవనోల్లాసములచేత సంమూఢుడును, బలారోగ్యమువలన గర్వితుఁడును అగు మానవుడు,

ఇష్టానుసారములైన కామోపభోగముల యందు, పవిత్రమైన ఆయుర్ధనమును (నిరుపయోగముగా) వెచ్చించుచున్నాడు.

శ్లో॥ దారపుత్ర గృహాదీన్ యః
సంపాద్యైవేహ తుష్యతి।
అకృత్వా తత్త్వజిజ్ఞాసాం
తస్యజన్మ నిరర్థకమ్॥ 24

తా॥ ఏ మానవుడు భార్యను, పుత్రులను, గృహాదులను సంపాదించి పారమార్థిక తత్వమునెఱుంగవలెనను వాంఛలేనివాడై యాలోక వాసనలయందే తుష్టిచెందుచున్నాడో అట్టివాని జన్మమునిష్ప్రయోజనము.

శ్లో॥ విరాగ్య పీంద్రియార్థేషు
దృఢనిశ్చయ వర్జితః।
కాలం నయతి తేష్వేవ
బలహీనో భయావృతః॥ 25

తా॥ విషయవాంఛలయందు విరాగియైనవాడుకూడ దృఢమైన నిశ్చయములేనివాడై, బలహీనుడును, భయావృతుడునై ఇంద్రియార్థముల యందే కాలముగడుపుచున్నాడు.

శ్లో॥ ఇంద్రియార్థేషుసూక్ష్మేచ్ఛా
విరక్తస్యాపివర్తతే।
అప్రమత్తేన ధీరేణ
జేతవ్యా సా ముముక్షుణా॥ 26

తా॥ (ఐహిక విషయములందు) విరక్తుడైన వానికిని ఇంద్రియార్థములయందు సూక్ష్మమైన ఇచ్ఛయుండును. అయ్యది బుద్ధిమంతుడును, ప్రమాదరహితుడును. మోక్షమందిచ్ఛ గలవాడును, అగు పురుషునిచేత జయింపబడవలసినది.

శ్లో॥ మహతా రాగపాశేన
స్నేహజేన సుబంధితః।
ఆరూఢోఽపి చ్యుతిం యాతి
మోహావరణ నష్ట దృక్॥ 27

తా॥ మోక్షపదవీమార్గమును అధిరోహించిన వాడయ్యును పురుషుడు విషయవాంఛల యెడల స్నేహమువలన కలిగిన దృఢమైన రాగపాశము చేత గట్టిగా బంధింపబడినవాడై మోహమనెడు ఆచ్ఛాదన (కప్పు) చేత కోల్పోయిన వివేకమనెడు దృష్టిగలవాడై చ్యుతినొందుచున్నాడు.

శ్లో॥ అదృష్టాదీని భూతాని
దృష్టమధ్యాని సజ్జన।
గతాన్యదర్శనంభూయః
శోకస్యావసరః కుతః॥ 28

తా॥ ఓ సజ్జనుడా! ప్రాణులశరీరములు, ఉత్పత్తికి పూర్వము చూడబడనివి, మధ్యకాలమున చూడబడుచున్నవి. మరల (లయ కాలమున) కన్పడనివై పోవుచున్నవి. అనగా అనిత్యముల నిభావము అనిత్యములగు ఇట్టిశరీరములయెడ శోకింపనవసరమేమికలదు?

శ్లో॥ నష్టం భవతి యద్దృష్టం
జాతో మృతో భవేద్యతః।
అనివార్యమిదం బుద్ధ్వా
జహి శోకమనర్థకమ్॥ 29

తా॥ (చర్మచక్షువులకు) గోచరించునదెల్లయు నశించును. పుట్టిన ప్రాణి జాతమంతయును మరణించును. ఇట్టి స్థితి మానవప్రయత్నముచే నివారింప శక్యముకానిదని తెలిసికొని దానియెడల అనర్థకరమైన శోకమును విడిచిపెట్టుము.

శ్లో॥ దుఃఖదంహి మనో వ్యాప్తం
సుఖదం చోప సంహృతమ్।
వ్యాప్తం భవతి కామేన
నిష్కామంతూప సంహృతమ్॥ 30

తా॥ మనస్సు ఇంద్రియార్థములందు వ్యాప్తమై దుఃఖమును కలిగించును ఉపసంహరింపబడినదై (నిశ్చలత్వము పొందినదై) సుఖమునిచ్చును మనస్సు యొక్క చంచలత కామమువలన కలుగును. ఉపసంహరణము కామహీనతవలన నగును.

శ్లో॥ మనోవైషయికం శత్రుః
బంధురాత్మా సునిర్మలః।
జ్ఞాత్వైత ద్భజతాం మాంహి
భావశుద్ధిం దదామ్యహమ్॥ 31

తా॥ విషయవాంఛల యందు వ్యాపృతమై మలినమైన మనస్సు తనకు శత్రువు, అట్లుకానిదై నిర్మలమయిన మనస్సు బంధువు అని తెలిసికొని నన్ను భజించువారికి భావ నైర్మల్యమును నేను కలుగఁజేయుదును.

శ్లో॥ అస్థిరం చంచలంచాపి
విబుధై ర్గృహ్యతే మనః।
వైరాగ్యాభ్యాస విజ్ఞానైః
మోక్షానంద ఫలప్రదైః॥ 32

తా॥ మోక్షానందమను ఫలమునీయఁజాలిన వైరాగ్యము, అభ్యాసము, విజ్ఞానము అనువానిచేత విద్వాంసులు స్థిరత్వము లేనిదియు, చంచలమగునదియు నగు మనస్సును కూడ వశపరచుకొనుచున్నారు.

శ్లో॥ వాగ్భిర్వదన్తి వేదాన్తం
త్యాగమార్గ వినిందకాః।
వంచయన్తి జనాన్మూర్ఖాన్
జిహ్వోపస్థ సుఖాలసాః॥ 33

తా॥ త్యాగమార్గమును నిందించువారును, జిహ్వోపస్థల సుఖములవలన అలసతనొందినవారును అగు కుత్సితులు మాటలతో వేదాంతమును జెప్పుచు మూర్ఖులయిన జన్నులను వంచింతురు.

శ్లో॥ శాస్త్రజాల పరిజ్ఞాతా
లబ్ధకీర్తి స్సుభోగవాన్।
తథాప్యసూయతాం యాతి
దృష్ట్వాన్యంసుయశోన్వితమ్॥ 34

తా॥ (సదసద్వివేకమును కలిగించెడు) అనేక శాస్త్రముల పరిజ్ఞానముకలవాడును, కీర్తిప్రతిష్ఠలు, చక్కని భోగములుకలవాడ యినప్పటికిని నరుడు, కీర్తివంతుడయిన అన్యుని చూచి అసూయ నొందుచున్నాడు.

శ్లో॥ దాతా విద్వాన్కులీనశ్చ
ప్రభుర్భోగీ విరాగ్యపి।
సామాన్యశ్చ ధనీ యోగీ
సత్కారేచ్ఛానుబంధితాః॥ 35

తా॥ దాత, విద్వాంసుడు, సత్కులమున జన్మించిన వాడు, ప్రభువు, భోగి, విరాగి; సామాన్యుడు, ధనవంతుడు, యోగి వీరందఱును సత్కారేచ్ఛలయందు (పూజాసన్మానాదులయందు) బంధితులగుచున్నారు.

శ్లో॥ అజ్ఞాత్వా సుఖ మంతస్థం
విషయేష్వవ లోకతే।
అలబ్ధ్వా తత్సుఖం తత్ర
విచారం హి సమశ్నుతే॥ 36

తా॥ మానవుడు తనలో నున్న ఆత్మానందమును గుర్తించలేక బాహ్యవిషయముల సుఖములకయి అఱ్ఱులు చాచుచున్నాడు. తానభిలషించు సుఖమునచట (బాహ్యవిషయములందు) పొందలేక కడకు విచారమును పొందుచున్నాడు.

శ్లో॥ యత్కించిత్సాధితం లోకే
సర్వం నశ్యతి కాలతః।
తస్మాత్త్వం నిర్మమోభూత్వా
నిస్సంగశ్చ సమాచర॥ 37

తా॥ లోకమున నీవు సాధించిన ఎట్టిదైనను కాలము ననుసరించి యది సర్వమునశించును. కావున (నశ్వరములగు వానియందు) మమకారములేని వాడవై సంగరహితుడవై ప్రవర్తింపుము.

శ్లో॥ ఇంద్రియార్థోప భోగేషు
క్షణికోపశమో భవేత్।
క్షణాదూర్ధ్వం పునస్తృష్ణా
ప్రబలైవ భవిష్యతి॥ 38

తా॥ ఇంద్రియసౌఖ్యముల అనుభవమునందు క్షణికమైన ఉపశమము కలిగినను ఆక్షణమైన పిదప తృష్ణ, (వాంఛ) ప్రబలమే కాగలదు. (అందుచే ఇంద్రియార్థోపశమము సార్వకాలికముగా సిద్ధింపనేరదని భావము.)

శ్లో॥ పూరణా దేకవాంఛాయాః
అన్యవాంఛోదయో భవేత్।
పారంపర్య క్రమేణైవం
తృష్ణైవ వివర్ధతే॥ 39

తా॥ (విషయోపభోగ సంబంధమగు) ఒక వాంఛను పూరించుటవలన వెంటనే మఱియొక వాంఛ పుట్టుచున్నది. ఈ

విధమయిన పరంపరాక్రమముచేత (వాంఛారూపమయిన) దాహము మాత్రమే వృద్ధియగుచున్నది.

శ్లో॥ తృష్ణాఽగ్రే సూక్ష్మరూపాపి
వర్ధతే హ్యనివారితా।
అనల స్సూక్ష్మరూపేణ
ప్రవిశ్యైవ వివర్ధతే॥ 40

తా॥ ఏవిధముగా అగ్నికణము స్వల్పమయినప్పటికిని (కాష్ఠాదులయందు) చేరిన వెంటనే వృద్ధిపొంది దహించి వేయుచున్నదో, అట్లే నివారింపబడనివాంఛ మొదటసూక్ష్మ రూపముననున్నను వెంటనే మిక్కిలిగా వృద్ధిపొందుచుండును.

శ్లో॥ కాలాత్కాలాంతరంవాంఛన్
దేశాద్దేశాంతరం తథా।
ప్రాప్తాద్వ స్త్వంతరం చేచ్ఛన్
కామకామీ విముహ్యతి॥ 41

తా॥ విషయవములయందు కోరికకలిగినమానవుడు సన్నిహితములగు దేశకాలవస్తువులవలన తృప్తి లేనివాడై అన్యములైన దేశ కాలవస్తువులను వాంఛించుచు మోహమునొందుచున్నాడు.

శ్లో॥ దేశతః కాలతశ్చాపి
వస్తుతశ్చాప్యబాధితమ్।
ఆత్మన్యే వాఖిలం సౌఖ్యం
లబ్ధ్వాధీరో నకాంక్షతి॥ 42

తా॥ బుద్ధిమంతుడు దేశమువలనను, కాలమువలనను, వస్తువ వలనను, బాధింపఁబడని దేశకాలవస్తువుల కతీతమైన దగుటచే నిత్యమైన బ్రహ్మానందరూపమైన సౌఖ్యమును ఆత్మయందే పొందినవాఁడై మోహమునొందకుండును.

శ్లో॥ వస్తు తత్త్వమవిజ్ఞాయ
విషయేంద్రియ మోహితః।
సంప్రాప్తేష్వరతిం ప్రాప్య
నవ్యేషు కురుతే మతిమ్॥ 43

తా॥ జనుడు వస్తువుయొక్క యదార్థస్వభావమును తెలిసికొనలేక, విషయేంద్రియములచేత మోహపెట్టబడినవాడై లభించినవానియందు ప్రీతినిపొందలేక క్రొత్తవస్తువు యందు వాంఛలను పెంచుకొనుచున్నాడు.

శ్లో॥ యతీనామపి దృశ్యంతే
రాగద్వేష పరాయణాః।
అర్థకామ సుఖాసక్తాః
మానపూజసు లంపటాః॥ 44

తా॥ భవసాగర తరణమునకై యత్నించు యతులలో కూడ మొదలంట త్రుంచివేయవలసిన రాగద్వేషములయందు నిష్ఠకలవారును, (దరికిఁజేరనీయరాని) అర్థకామములవలన కలిగెడు సుఖములయందు ఆసక్తికలవారును, (నిష్ప్రయోజనములయిన) పూజాసత్కారములయందు కాంక్షగలవారును గన్పట్టుచున్నారు.

శ్లో॥ యదగ్రే దృశ్యతే సౌఖ్యం
సంస్పర్శజ సుఖేషుహి।
తదల్పం క్షణికం విద్ధి
దుఃఖమూలంచ మోహజమ్॥ 45

తా॥ దేహేంద్రియములకు విషయవస్తువులయొక్క స్పర్శవలన కలిగెడు సుఖములయందు ఏది ఆరంభమున సౌఖ్యముగా భాసించుచున్నదో అయ్యది అల్పమనియు క్షణకాలములో నశించునదనియు, దుఃఖమునకు కారణమనియు, అజ్ఞానమువలన పుట్టినదనియు తెలిసికొనుము.

శ్లో॥ నిద్రాం తంద్రాంచ భీతించ
సంమోహం వ్యసనం తథా।
ఆలస్య మతిమానిత్వం
త్యక్త్వాశు విజయంవ్రజ॥ 46

తా॥ (అధికమగు) నిద్రను, ప్రమత్తతను, భయమును, ఇంద్రియ వ్యామోహమును, వ్యసనమును, అలసభావమును, దురభిమానమును పరిత్యజించి శీఘ్రముగా (భవబంధ విమోచనకై చేయు యుద్ధమున) విజయమును బొందుము.

శ్లో॥ హర్ష శోకాన్వితంవేగం
సుఖదుఃఖ సముద్భవమ్।
సోఢుం శక్తస్య తస్యేహ
దుఃఖాభావో భవిష్యతి॥ 47

తా॥ (లౌకిక విషయములవలన కలిగెడు) సుఖదుఃఖముల నుండి పుట్టిన హర్షశోకములయొక్క వేగమును సహింపశక్తి కలవానికి ఇహలోకమున దుఃఖములేకుండుట సంభవించును. (అనగా సంతోషము కలిగినపుడు పొంగి, దుఃఖము కలిగినపుడు క్రుంగువానికి మిగులునది దుఃఖమేయని భావము.)

శ్లో॥ శ్రేయస్సాధన సామగ్ర్యాం
శక్తి రేవ గరీయసీ।
స్వస్య ధర్మాను సారిత్వం
శక్తిరిత్యభిధీయతే॥ 48

తా॥ శ్రేయస్సునుసాధించు సాధన సంపత్తియందు "శక్తి" యనునది సర్వోత్తమమైనది తనకు విహితమయిన ధర్మమును అనుసరించుటయే శక్తియని విజ్ఞులచే చెప్పబడినది.

శ్లో॥ పూర్వజన్మసు పాపాని
కృతాన్యేవేహ జన్మని।
దారిద్రవ్యాధి దుఃఖైస్తు
బాధన్తే సర్వమానవాన్॥ 49

తా॥ పూర్వజన్మమునందును, ఈ జన్మమునందును, చేయబడిన అనేక పాపములు, పేదరికము, రోగములు, దుఃఖములు అనువానితో సర్వమానవులను బాధించుచున్నవి. (జన్మము పాపహేతువై బాధాకరమగుచున్నది. కావున బాధోపశమనమునకై జన్మరాహిత్యము కొఱకు ప్రయత్నించుటయే ఉత్తమమార్గమని భావము.)

శ్లో॥ సుఖసంప్రాప్తయే ధర్మః
ప్రాణినాంచ విధీయతే।
పరిహారాయ దుఃఖస్య
హ్యధర్మః ప్రతిషిధ్యతే॥ 50

తా॥ సర్వప్రాణులకును సుఖమును కలిగించుటకై వేదమాతవలన ధర్మము విధింపబడినది. అట్లే దుఃఖమును పరిహరించుటకై అధర్మమునిషేధింపబడినది. (అనగా ధర్మము నాచరింపకుండుట, అధర్మమును తొలగించుకొనకుండుట దుఃఖహేతువులని భావము.)

శ్లో॥ వేదధర్మ పరోనిత్యం
సర్వాహంకార వర్జితః।
సర్వకర్మ ఫలత్యాగీ
శుద్ధసత్వో భవిష్యతి॥ 51

తా॥ నిత్యము వేదధర్మమునందు శ్రద్ధకలవాడును అనగా వేదవిహితకర్మల నాచరించువాడును సర్వమైన అహంకారమును విసర్జించినవాడును సర్వ కర్మఫలములను బ్రహ్మార్పణ బుద్ధితో త్యాగము చేయువాడును అగుమానవుడు అంతఃకరణశుద్ధిని పొందగలడు.

శ్లో॥ సన్న్యస్య సర్వకర్మాణి
సంప్రాప్య తత్త్వమాత్మనః।
సంసారగతి ముల్లంఘ్య
సంచరేన్ముక్త సంశయః॥ 52

తా॥ జనుడు నిత్యనైమిత్తి కాది కర్మలనన్నింటిని సన్యసించి, ఆత్మతత్వమును సంపాదించి సంసారమార్గము నతిక్రమించి, సర్వసంశయములనుండి విడివడినవాడై సంచరింపవలయును.

శ్లో॥ ఐశ్వర్యోన్మాదమూఢాత్మా
యోమాం విస్మృత్యవర్తతే।
మమాస్తిత్వ ప్రబోధాయ
తస్యైశ్వర్యం హరామ్యహమ్॥ 53

తా॥ సంపదవలనకలిగిన ఉన్మాదముచే మూఢమయిన బుద్ధిగలవాఁడై (పరమాత్మస్వరూపుడనగు) నన్ను మరచి ఎవ్వఁడు సంచరించునో అట్టివానికి నా యునికిని ప్రబోధించుటకై వాని సంపద నంతటిని హరించెదను.

శ్లో॥ కిమస్తి శోభనందేహే
శీర్యమాణే చ నశ్వరే।
క్షీణేవయసి రమ్యత్వం
సర్వం నశ్యతి తత్క్షణమ్॥ 54

తా॥ (దినదినము) శీర్ణమగుచున్నట్టియు అనగా శిథిలమగుచున్నటియు నశించునటిదియునగు దేహమునందు రమణీయమైనదేమికలదు? వయస్సు క్షీణించుచుండగా సమస్తమైన రమ్యతయు వెనువెంటనే నశించుచున్నది.

శ్లో॥ అలంకృతోఽప్యయందేహః
స్వర్ణాంబర స్రగాదిభిః।
స్వభావ మలినత్వాద్ధి
జ్ఞానిభిః పరిభూయతే॥ 55

తా॥ ఈశరీరము బంగారుభూషణములతోడను చిత్ర విచిత్రములయిన వస్త్రములతోడను సువాసనా భరితములగు పూలమాలలతోడను అలంకరించబడినప్పటికిని స్వభావముచేత మలినమయిన దగుటవలన జ్ఞానులచే తిరస్కరింపబడుచున్నది.

శ్లో॥ వస్తు మిధ్యాత్వ విజ్ఞానాత్
శాంతిర్నహిహ కేవలాత్।
మిధ్యావస్తు పరిత్యాగాత్
పూర్ణ శాంతి ర్భవిష్యతి॥ 56

తా॥ కేవలము వస్తువుయొక్క మిధ్యాతత్వమును అనగా అసత్య స్వభావమును గ్రహించినంతమాత్రమున శాంతి కలుగదు. మిధ్యయని తెలిసికొనిన వస్తువును పరిత్యజించుట వలననే పరిపూర్ణమయిన శాంతిలభించును.

శ్లో॥ శృతే దృష్టే స్మృతే జ్ఞాతే
చాను భూతే నరస్సదా।
విషయే నిర్వికారో యః
ధృవంతస్య సుఖం భవేత్॥ 57

తా॥ (శబ్దస్పర్శరూప రసగంధములను) విషయములు వినబడినప్పటికిని, స్మరింపబడినప్పటికిని, అనుభవింపబడినప్పటికిని

ఏజనుడు సర్వదా వికారము పొందనివాడై యుండునో యట్టివానికి ధృవముగా సుఖముకలుగును.

శ్లో॥ క్షణంస్థిత్వా సుఖంయాతి
క్షణే దుఃఖం వినశ్యతి।
సుఖదుఃఖ భ్రమంత్యక్త్వా
సుఖ మక్షయమశ్నుతే॥ 58

తా॥ (లోకస్థంబంధవంగం) సుఖముక్షణకాలముండి పిదపపోవును. దుఃఖముకూడ క్షణకాలములో నశించును. ఇట్టి సుఖదుఃఖములయొక్క భ్రమనువిడనాడినచో మానవుడు శాశ్వతమయిన సౌఖ్యమునను భవించును.

శ్లో॥ యావత్కాలం మనోయస్య
స్వాధీనం వర్తతే ధ్రువమ్।
తావత్తస్య భయంనాస్తి
తృష్ణామోహ సముద్భవం॥ 59

తా॥ మానవునకు ఎంతకాలము తనమనస్సు తనకు స్వాధీనమైయుండునో అంతకాలము ఆశామోహములవలన కలిగెడు భయము దరిజేరదు.

శ్లో॥ సుఖ కోమల సంస్పర్శాః
శబ్దాశ్చ మధురాద్భుతాః।
రమ్యా సుందరరూపాణి
నాకర్షం త్యాత్మవేదినమ్॥ 60

తా॥ సుఖమునొసంగు కోమలములయిన సంస్పర్శలును, మధురములును అద్భుతములునైనశబ్దములును, మనోహరములు సుందరములునైన రూపములును ఆత్మవేత్తను ఆకర్షింపజాలవు.

శ్లో॥ హృద్యుపలభ్య రూపంమాం
సహస్రారస్థితం శివమ్।
చిదానంద తనుం శాంతమ్
ఆశ్రయాశు నిరంతరమ్॥ 61

తా॥ హృదయమునందు (అనగా దహరాకాశమునందు) పొందదగిన రూపము కలిగినట్టియు సహస్రారమందు నెలకొన్నట్టియు మంగళస్వరూపుడనైనట్టియు, స్వయం ప్రకాశానందమే తనువుగా కలిగినట్టియు, శాంతుడనైనట్టియు నన్ను శీఘ్రముగా నిరంతరము ఆశ్రయింపుము.

శ్లో॥ స్మరంతి కృతపుణ్యాయే
స్వాంతస్థం మాం సదాశయాః
సుఖం ప్రజ్ఞాం స్మృతిం జ్ఞానం
మత్తో లబ్ధ్వా జయంతితే॥ 62

తా॥ సుకృతాత్ములైన జనులు సత్పదార్థమందు భావనలుకలవారై వారియాత్మలలో వెలుగొందెడు నన్ను స్మరింతురు నావలన సుఖమును, ప్రజ్ఞను, స్మృతిని, జ్ఞానమును పొంది (సర్వత్ర) జయమునొందుదురు.

శ్లో॥ బ్రహ్మైవాహం పరం సత్యం
మాం విద్ధి పరమేశ్వరమ్।
జీవభూతో మమైవాంశః
జగదే తద్ధి మన్మయమ్॥ 63

తా॥ పరమార్థ సత్యస్వరూపమగు పరబ్రహ్మమును నేనే। సర్వజగత్పాలకుడగు పరమేశ్వరునిగా నన్ను గుర్తింపుము. జీవజాతమంతయు నాయొక్క అంశమే. ఈదృశ్యమానమగు సర్వప్రపంచమును నాచేతనే నిండియున్నది.

శ్లో॥ గుణప్రభుం గుణాతీతం
నర నారీ తనుర్ధరం।
సదైకం మాం భజస్వత్వం
సర్వభూతేశ్వరేశ్వరమ్॥ 64

తా॥ (సత్వరజస్తమో) గుణములకు శాసకుడనైనట్టియు, త్రిగుణములకతీతుడనైనట్టియు స్త్రీ పుంరూపతనువును (లేక స్త్రీ శరీరములను పురుషశరీరములను) ధరించినట్టియు, సర్వభూతముల యొక్కయు ఈశ్వరులకు ఈశ్వరుడనైనట్టియు ఒక్కడనేయైనట్టియు నన్ను నీవెల్లప్పుడును భజింపుము.

*ఇతిశ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవతః కృతౌ*
*శ్రీ మద్భగవద్భారత్యాం అధ్యాత్మవిద్యాయాం షష్ఠోఽధ్యాయః*

*ఇది శ్రీవిశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవత్కృతి యగు*
*శ్రీమద్భగవద్భారతియను అధ్యాత్మవిద్య యందు షష్ఠాధ్యాయము.*

# ॥श्रीमद्भगवद्भारती॥

## శ్రీమద్భగవద్భారతీ

### సప్తమోऽధ్యాయః

శ్లో॥ వైరాగ్యస్య దృఢత్వాయ
సద్వివేకోదయాయచ।
శోకమోహ వినాశాయ
శ్రుణ్వేతత్సావధానతః॥ 1

తా॥ (ప్రాపంచిక విషయములందలి) వైరాగ్యము దృఢమగుటకును, పరబ్రహ్మసంబంధమగు వివేకము ఉదయించుటకును, శోకమోహములు వినాశము నందుటకును ఈ చెప్పఁబోవుదానిని సావధానముగ ఆలకింపుము.

శ్లో॥ అనాదివాసనా జాలైః
ప్రేరితస్సన్ నరస్సదా।
అవిరక్తో మహామోహాత్
లోకేఽస్మిన్ సః ప్రవర్తతే॥ 2

తా॥ అనాదిగా వచ్చుచున్న (కర్మఫలరూపములైన) వాసనాజాలముచేత సర్వదా ప్రేరితుండగుచు నరుఁడు (ఇంద్రియ వాంఛారూపమైన) మహామోహమువలన విరక్తి పొందనివాఁడై యీలోకమున ప్రవర్తిల్లుచున్నాఁడు.

శ్లో॥ అజ్ఞానాత్ స్వస్వరూపస్య
కామో బాహ్యేషుజాయతే।
కామీ కరోతి కర్మాణి
బంధస్తతోఽభిజాయతే॥ 3

తా॥ స్వస్వరూపముయొక్క తెలివిలేని కారణముగా నరునకు బాహ్యవిషయములందు కామము కలుగుచున్నది. కామలోలుపుఁడై నరుఁడు కర్మలను చేయుచు, (ఆ కర్మముల ఫలానుభవమనెడు) బంధమును బొందుచున్నాడు.

శ్లో॥ అవలంబ్య దురాచారాన్
దుర్మతాని చ కాముకాః।
సంపాద్య క్షుద్రసౌఖ్యాని
నరకంయాంతి దుర్ధియః॥ 4

తా॥ కాముకులు దుష్టములైన ఆచారములను, దుష్టములైన (చార్వాక పాషండకాపాలికాది) మతములను అవలంబించి, వానివలన క్షుద్రములైన సౌఖ్యములను పొంది దుష్టబుద్ధులై కడకు నరకమున కూలుచున్నారు.

శ్లో॥ జీవోఽయం మోహసంకీర్ణః
దారాపత్య సుఖైరమన్।
లబ్ధ్వాపి మానవందేహం
మోక్షం నేచ్ఛతి కించన॥ 5

తా॥ (విషయేంద్రియవముల యొక్క) మోహవముతో సంకీర్ణుఁడైన యీ జీవుడు, భార్యాపుత్రాదుల సుఖమునందు

రమించుచున్నవాఁడై (పురాకృత సుకృతఫలమైన) మానవ దేహమును బొందియు, మోక్షమును వాంఛింపకున్నాఁడు. (అట్టివాని దుర్గతిని) ఏమని చెప్పవలెను?

శ్లో॥ ఇంద్రియస్వాదు సౌఖ్యేషు
మోదమానో నిరంతరమ్।
పరమార్థపథం జ్ఞాతుం
నకరోతి స్పృహామపి॥ 6

తా॥ ఇంద్రియములయొక్క రుచికరములైన సౌఖ్యములయందు నిరంతరము ముదమునందుచున్నవాఁడై పరమార్థ మార్గమును ఎఱుగుటకు, నరుఁడు వాంఛామాత్రమైనను చేయకున్నాడు.

శ్లో॥ అనంతర క్షణే యద్యత్
ప్రభవిష్యతి మానవః।
అల్పజ్ఞ స్స న జానాతి
వృథాగర్వేణ వంచితః॥ 7

తా॥ అల్పజ్ఞుఁడైన మానవుడు అనంతర క్షణమున ఏదేది సంభవించునో యెఱుగడు. (కాని) వ్యర్థమైన గర్వముతో వంచింపబడుచున్నాడు.

శ్లో॥ యథేష్టంచ సుఖంప్రాప్తుం
పరిహర్తు మవాంఛితమ్।
అశక్నువన్నరో మూఢః
వృథాగర్వేణ వంచితః॥ 8

తా॥ మూఢుఁడైన నరుఁడు ఇష్టానుకూలమైన సుఖమును హొందుటకును, తనకోరికపు భిన్నమైనదానిని పరిహరించుటకును శక్తిలేని వాడయ్యు వ్యర్థమైన గర్వముతో వంచింపఁబడుచున్నాడు.

శ్లో॥ విషయాశా దృఢేకాయే
దుర్బలే రోగచింతనా।
మూర్ఖాణాంహి భవేదిత్థం
ధిక్ తేషాం జన్మనిష్ఫలమ్॥ 9

తా॥ మూర్ఖమానవులకు, శరీరము దృఢముగానుండగా విషయసుఖములందలి ఆశయును, శరీరము దుర్బలముకాఁగా రోగసంబంధచింతయును, ఇట్లు (నిరంతరము) కలుగుచున్నది ఛీ! ఛీ! అట్టివారి జన్మము నిష్ఫలము.

శ్లో॥ సుందరోఽస్తుకురూపోఽస్తు
శరీరం సర్వదేహినామ్।
మలమూత్రాలయం తుచ్ఛం
రక్తమాంసాస్థిపంజరమ్॥ 10

తా॥ (జీవి) సుందరుఁడగుఁగాక! కురూపుఁడగుగాక! దేహధారులగు సర్వులకును శరీరము మలమూత్రముల కాలయమైనదియు, తుచ్ఛమైనదియు, రక్తమాంస, అస్థులకు పంజరమైనదియు మాత్రమే.

శ్లో॥ అసహ్యేసమలేఽనిత్యే
హ్యరమ్యే దోషసంయుతే।
శరీరేఽస్మిన్ మనఃకృత్వా
విద్వానపి విముహ్యతి॥ 11

తా॥ అసహ్యమైనట్టిదియు, మలభూయిష్ఠమైనట్టిదియు అనిత్యమైనట్టిదియు (శాశ్వతము కానట్టిదియు) ఏమాత్రము రమ్యము కానట్టిదియు, దోషములతో కూడినదియునగు ఈ (శీర్ణమగు లక్షణముగల) శరీరమునందు మనస్సునుంచి పండితుడు కూడ విశేషముగా మోహమునందుచున్నాడు.

శ్లో॥ నాస్వాదయేద్రసంమోహాత్
వృత్తరూపేషు యోషితామ్।
తద్ధితం మోహితం కృత్వా
పాతయత్యవశం భృశమ్॥ 12

తా॥ స్త్రీలయొక్క శీలవములయందుగాని రూపవముల యందుగాని మోహమువలన మానవుఁడు రసమును ఆస్వాదింప రాదు. అట్టి ఆస్వాదనము అతనిని మోహితునిగా చేసి వివశునిగా చేసి మిక్కిలిగా నశింపఁజేయును.

శ్లో॥ స్త్రీవ్యక్త్యాహిరతింయంతి
పశుపక్ష్యాదయోఽపిచ।
విమూఢోఽపి తథైవేహ
విజ్ఞస్యైకో విరజ్యతే॥ 13

తా॥ పశుపక్ష్యాదులుకూడ స్త్రీ వ్యక్తియందు రతిని బొందుచున్నవి. అట్లే వివమూఢుడైన మానవుడుకూడ అగుచున్నాడు. విజ్ఞానియైన మానవుడొక్కడుమాత్రము (నీచములైన స్త్రీ సుఖాదుల యందు) విరక్తినిఁ బొందుచున్నాడు.

శ్లో॥ రతిం యత్ర మనోయాతి
చంచలం దృశ్యవస్తుషు।
తస్మాత్త్వం తత్పరావర్త్య
మోక్షమార్గే నివేశయ॥ 14

తా॥ చంచలమైన మనస్సు దృశ్యములైన (నాశన శీలములైన) యే వస్తువులయందు రతిని బొందుచున్నదో అట్టి వాని నుండి ఆ మనస్సును (ప్రయత్నపూర్వకముగా) విముఖము గావించి (నిత్యమైన) మోక్షమార్గమునందు ప్రవేశ పెట్టుము.

శ్లో॥ బద్ధ్వాకర్మేంద్రియాణీహ
కామభోగేషు వాంఛయా।
యఃక్రీడతి మనోరాజ్యే
దుర్బలో రోగవాన్భవేత్॥ 15

తా॥ కామభోగములయందలి కోరికచేత (వాక్పాణి పాద పాయూపస్థల నెడు) కర్మేంద్రియములను బంధించి మనస్సనెడు రాజ్యమున నెవడు క్రీడించుచున్నాడో వాడు దుర్బలుడై రోగవంతుడగును.

శ్లో॥ రాజ్ఞశ్చధనినశ్చాపి
సుందరస్యాపి ధీమతః।
దీనస్య చ సమంవిద్ధి
దుఃఖం యద్భవసంభవమ్॥ 16

తా॥ జన్మసంభవమైన దుఃఖమేదిగలదో యది రాజునకు, ధనవంతునకు, సుందరుఁడైనవానికి, బుద్ధిమంతునకు, దీనునికి (ఇట్లిల్లవారలకును) సమానమేయని తెలిసికొనుము.

శ్లో॥ సుందరో౽పి జరామేతి
బలిష్ఠో౽పి మృతింతథా।
ధనినో౽పి భవేద్దైన్యం
విదాంకింమోహకారణమ్॥ 17

తా॥ సుందరుఁడుకూడ వార్ధక్యమును బొందుచున్నాడు. బలిష్ఠుడుకూడ మరణించుచున్నాడు. ధనవంతునకైనను దైన్యము కలుగుచున్నది. ఇట్టియెడల విజ్ఞులకు మోహకారణమేమి గలదు?

శ్లో॥ దేహాభిమానసంమూఢాః
తృష్ణాకామ ప్రపీడితాః
మమతా తాప సంతప్తాః
మజ్జన్తి భవసాగరే॥ 18

తా॥ దేహమునందలి అభిమానమువలన మిక్కలి మూఢులైన వారును, ఆశాకామములచేత పీడింపఁబడిన వారును, మమకారమనెడు తాపమువలన సంతృప్తులైన వారును భవమనెడు సాగరమునందు మునుగుచున్నారు.

శ్లో॥ క్షణికాపేక్ష సంమోహే
కామక్రోధ వశంగతః।
త్యజ్యతే పూర్వ పుణ్యైశ్చ
భావికల్యాణ దూరగః॥ 19

తా॥ క్షణికమైన ఆవేశమువలన కలిగిన అజ్ఞానము నందు, కామక్రోధములకు వశుడైన మానవుడు పూర్వపుణ్యములచేత పరిత్యక్తుడగుచున్నాడు. రాబోవు కళ్యాణములకు దూరముగా తొలగుచున్నాడు.

శ్లో॥ క్షణకాల ప్రమాదాద్ధి
చిరకాల తపఃక్షయః।
ప్రమాదాన్నాపరో మృత్యుః
శాంతి విజ్ఞాననాశకః॥ 20

తా॥ క్షణకాలమునందలి ప్రమాదమువలన చిరకాలము ఆర్జించిన తపఃఫలము క్షయమునొందును. ప్రమాదముకంటె ఘోరమైన మృత్యువులేదు. అయ్యది శాంతి విజ్ఞానములను నశింపజేయును.

శ్లో॥ అగ్రేకించిత్సుఖంభుక్త్వా
పశ్చాద్భవంతి రోగిణః।
వైషయికా జనాస్సర్వే
నష్టాత్మ సుఖసాగరాః॥ 21

తా॥ విషయవాంఛలను మరిగిన జనులందఱును, ముందుగా అతిస్వల్పమైన సుఖము ననుభవించి పిదప రోగవంతులగుచున్నారు. అందువలన నిత్యమైన ఆత్మానందమనెడు మహాసముద్రమును కోల్పోవుచున్నారు.

శ్లో॥ అనభిజ్ఞో నరో భ్రాంత్యా
రమణీయ త్వచావృతమ్।
అస్థియంత్ర మిమందేహం
సంపశ్యన్ రాగమశ్నుతే॥ 22

తా॥ చక్కని వివేకములేని మానవుడు భ్రాంతిచేత, రమణీయమైన చర్మముచేత ఆవరింపఁబడిన అస్థియంత్రమైన యీ దేహమును జూచి రాగమును పొందుచున్నాడు.

శ్లో॥ నవయౌవన సంపన్నాం
జరావృద్ధాంచ బాలికామ్।
నిర్వికారేణ యఃపశ్యే
త్తం నౌతిదేవరాడపి॥ 23

తా॥ నూతన యౌవన సంపన్నురాలిని, జరావృద్ధను, బాలికను, ఏనరుఁడు కామాదివికారములు లేకుండ చూచునో అట్టివానికి ఇంద్రుఁడుకూడ నమస్కరించును.

శ్లో॥ ఆఖండలాని భోగ్యాని
లబ్ధ్వాపి కిం ప్రయోజనమ్।
చంచలాన్యేవ సౌఖ్యాని
హ్యధ్రువం కిల జీవనమ్॥ 24

తా॥ ఇంద్రసంబంధములైన సౌఖ్యములనైననుపొంది ప్రయోజనమేమి కలదు? జీవనమే అధ్రువము కావున ఎట్టి

సౌఖ్యములైనను చంచలములే (కావున మానవుడు శాశ్వతానందమునకై ప్రయత్నింపవలెను.)

శ్లో॥ క్షణకాలిక సౌఖ్యైస్తైః
సుసమాకృష్ట మానసాః।
కాలం నహి ప్రపశ్యంతి
ధావ న్తం మృత్యుకారణమ్॥ 25

తా॥ మానవులు క్షణికములైన సౌఖ్యములచేత బాగుగా ఆకర్షింపబడిన మనస్సుకలవారై మృత్యువునకు కారణమై పరువిడుచున్నకాలమును తెలియకున్నారు.

శ్లో॥ ధృత్వేహ వివిధాన్ వేషాన్
రంగస్థల నటోపమాః।
ఆగచ్ఛన్త్యథ నిర్యాన్తి
జగద్రంగస్థలే జనాః॥ 26

తా॥ వివిధములైన వేషములను ధరించిన నాటకరంగ స్థలమునందలి నటులను పోలినవారై జనులు జగత్తనెడు రంగస్థలము నందు వచ్చుచున్నారు మరల నిష్క్రమించుచున్నారు. (ఇట్లాగమన నిర్గమనములతోడనే అనిత్యత్వమును భజించుచున్నారని భావము.)

శ్లో॥ ప్రాతస్సాయ మహోరాత్రి
చైత్రఃఫాల్గునికఃక్రమాత్।
ముహుర్ముహుః భ్రమ త్యేవం
కాలేకదా విరాగతా॥ 27

సూర్యోదయ సాయంసమయములు, పగలు, రాత్రి, చైత్రము ఫాల్గుణము ఈ క్రమమున మాటిమాటికి పరివర్తన శీలమైన కాలమునందు మానవునికి వైరాగ్యము జనించి దృఢపడు తెన్నడు?

శ్లో॥ ఇష్టైస్సహ వియోగస్తు
మహాన్ క్లేశకరః స్మృతః।
ప్రియా ప్రియ విభాగోఽత్ర
కారణం క్లేశ సంతతేః॥ 28

తా॥ ఇష్టులైనవారితోడి వియోగము గొప్ప క్లేశముగా పరిగణింపఁబడుచున్నది (దీనిని పరిశీలింపగా) ఈ లోకమున కొన్ని ప్రియములు, కొన్ని అప్రియములు అను విభాగమే సర్వక్లేశసమూహమునకు కారణమగుచున్నది. (అందువలన సర్వము పరమాత్మ మయమని సంభావించి ప్రేమింపవలెనని భావము.)

శ్లో॥ కాంక్షాదుఃఖం క్రియాదుఃఖం
సంసారో దుఃఖమూలకః।
హిత్వేదం మాయికంవిశ్వం
మత్సంస్థాంశాంతిమాప్నుహి॥ 29

తా॥ కాంక్షఅనునదియే దుఃఖము దానిని తీర్చుకొనుటకుఁ జేయు క్రియయు దుఃఖదాయకమే. ఇట్లుగా సంసారము దుఃఖమునకు మూలమగుచున్నది. ఇట్టి మాయికమైన( సంసారరూపమైన) విశ్వమును ఛేదించి నాయందు నెలకొన్న శాంతిని పొందుము.

శ్లో॥ అక్షానుగమనం విద్ధి
బుద్ధేః పతనకారణమ్।
ఇంద్రియాణ్యనుస్మృత్యైవ
మహాన్తోపి భ్రమంగతాః॥ 30

తా॥ ఇంద్రియముల ననుసరించి పోవుటయే బుద్ధి యొక్క పతనకారణమని తెలిసికొనుము. ఇంద్రియముల ననుసరించుట వలననే మహాత్ములుకూడ భ్రమకు లోనగుచున్నారు.

శ్లో॥ అవిద్యా మోహితంచిత్తం
తృప్తింగచ్ఛతి సత్వరమ్।
కామిన్యాది సుఖేష్వేవ
తస్మాదేతత్ప్రబోధయ॥ 31

తా॥ చిత్తము అజ్ఞానముచేత మోహితమై కామినీ సౌఖ్యము మున్నగు (నీచములైన) సుఖములయందే సత్వరముగా తృప్తిని పొందుచున్నది. అట్టిచిత్తమును (నిత్యమైన పరమానందానుభూతికై) మేల్కొల్పుము.

శ్లో॥ శరీరలక్షణం హైన్యం
జ్ఞాత్వాపి యౌవనే స్థితః।
పశువద్భ్రాంతి మాప్నోతి
మోహప్రదంహియౌవనమ్॥ 32

తా॥ యౌవనవంతుడు ఈ శరీరలక్షణము హైన్యమని గుర్తెఱిగి కూడ పశువువలె భ్రాంతిని పొందుచున్నాడు. యౌవనము మోహమును కలిగించునట్టిదికదా!

శ్లో॥ వస్తు యావదసంప్రాప్తం
రమ్యం తావత్ప్రతీయతే।
భోగలబ్ధో రసంత్యక్త్వా
జుగుప్సాయై భవిష్యతి॥ 33

తా॥ (కాంక్షితమైన ఒకానొక) వస్తువు ఎంతవఱకు చేతికందదో అంతవఱకు రమ్యముగనే అనిపించును. ఆ వస్తువు లభించి అనుభవింపఁబడిన పిమ్మట నీరసమై జుగుప్సను కలిగించును.

శ్లో॥ దేహపుష్టిం సమాలోక్య
మోహదృష్టిం చ మాకురు।
జ్ఞాన దృష్టిం సదాశ్రిత్య
స్వాత్మతుష్టిం లభస్వహి॥ 34

తా॥ దేహముయొక్క పుష్టినిచూచి దానియందు మోహదృష్టిని పొందకుము సర్వకాలములలో జ్ఞానదృష్టిని ఆశ్రయించి, స్వాత్మతుష్టిని పొందుమోయి!

శ్లో॥ కాంతాది విషయాన్విద్ధి
భోగానంతర దుఃఖదాన్।
ఆపాతమధురాః సర్వాన్
విషయాన్ త్యజ సువ్రత॥ 35

తా॥ కాంతాది విషయములను, అనుభవానంతరము దుఃఖమును కలిగించునవని యెఱుగుము. అప్పటికి (అనుభూతి

కాలమునకు) మాత్రము మధురములైన సర్వవిషయములను, సువ్రతుండా! పరిత్యజింపుము.

శ్లో॥ రమ్యత్వ సుఖదత్వాది
దృష్టిం మాకురువస్తుషు।
విషయార్థేషు సక్తాత్మా
సౌఖ్యం సఃనైవగచ్ఛతి॥ 36

తా॥ (ఆయా ప్రాపంచిక) వస్తువులయందు, రమ్యత్వము, సుఖదత్వాము మున్నుగానైన దృష్టినుంచకుము, విషయార్థముల యందు సక్తమైన ఆత్మగలవాడు ఎన్నటికి సుఖమును పొందంజాలడు.

శ్లో॥ హీనం వస్తు సుఖంమత్వా
రమంస్తత్ర నిరంతరమ్।
మోహిన్యా మాయయాభ్రాంతః
దుఃఖం విందతి దారుణమ్॥ 37

తా॥ మోహమును కలిగించు మాయచేత భ్రాంతుడైన నరుడు హీనమైన వస్తువును సుఖకరమైన దానినిగా తలపోసి, దానియందు రమించుచు దారుణమైన దుఃఖమును పొందుచున్నాడు.

శ్లో॥ యత్రయదా మనోయాతి
విషయాకర్షితం జవాత్।
తతస్తదా వివేకేన
వినివార్య స్థిరం కురు॥ 38

తా॥ విషయములవలన ఎప్పుడు మనస్సు మిక్కలి వేగముగా ఆకర్షింపబడి యెటువైపునకు పోవుచున్నదో అప్పుడు వివేకముచేత దానిని ఆవైపు నుండి దృఢముగా నివారించి స్థిరమైన దానినిగా చేయుము.

శ్లో॥ అత్యంత దుర్లభా ముక్తిః
అత్యంత చపలం మనః॥
యతే శ్చాపి మనశ్చిత్రం
ప్రవృత్తౌ పరిధావతి॥ 39

తా॥ మోక్షము అత్యంత దుర్లభమైనది. మనస్సు అత్యంత చపలమైనది. (ముముక్షువైన) యతి యొక్క మనస్సుకూడ, చిత్రము! (ముక్తిదూరమైన) ప్రవృత్తి మార్గమునందు పరువులిడుచున్నది.

శ్లో॥ అభ్యాసాలస బుద్ధిర్యః
దేహాభి మానవాన్నరః॥
యేనకేనాపి యోగేన
సిద్ధింస నైవగచ్ఛతి॥ 40

తా॥ దేహమునందభిమానముగలిగిన నరుడు, అభ్యాసమునందలసమైన బుద్ధికలవాఁడై, ఏవిధమైన యోగముచేత కూడ సిద్ధిని పొందనేజాలఁడు.

శ్లో॥ శబ్దాది విషయాస్సర్వే
మోహావేశే మనోహరాః॥
మోహాశాంతౌ త ఏవేహ
రుచిహీనా భవంతిహి॥ 41

తా॥ శబ్ద స్పర్శరూపరస గంధములను సర్వవిషయములును, మోహావేశకాలమున మనోహరములై కన్పట్టును. (అట్టి క్షణికమైన) మోహావేశము ఉపశమింపఁగా, ఆ శబ్దాది విషయములే రుచిహీనము లగుచున్నవికదా!

శ్లో॥ సంయోగేన వియోగేన
వికారేణ క్షయేణచ।
యన్నశ్వరం భవేద్వస్తు
తత్కాంక్షిణస్సుఖంకథమ్॥ 42

తా॥ ఏ వస్తువు సంయోగముచేత, వియోగముచేత, వికారముచేత, క్షయముచేత నశించు లక్షణము కలది అగుచున్నదో అట్టిదానిని కాంక్షించువానికి సుఖమెట్లులభించును?

శ్లో॥ భగ్నాభవంతి కాంక్షాశ్చ
ప్రాతికూల్యం ప్రవర్తతే।
భయదం జీవనం క్లిష్టం
లోకారామస్య సర్వథా॥ 43

తా॥ ఇహలోకమే ఆరామమనుకొనువానికి కాంక్షలన్నియు భగ్నములగుచున్నవి (లౌకికములైన వానియందు) వ్యతిరేకభావము ప్రబలమగుచున్నది. అన్ని విధములుగా జీవితము భయంకరమై క్లేశకరమగుచున్నది.

శ్లో॥ ఆత్మనాశో నకర్తవ్యః
ఆత్మోద్ధారం సదాకురు।
ఆత్మైవేహాత్మనస్త్రాతా
స్వాత్మానంస్వయముద్ధర॥ 44

తా॥ ఆత్మ వినాశము చేయఁదగనిది. సదా, ఆత్మోద్ధరణము చేయుము. ఆత్మయే ఆత్మకు రక్షకము. కావున స్వయముగ నీ ఆత్మను నీవు ఉద్ధరించుకొనుము.

శ్లో॥ ఆత్మానం సతతం కృత్వా
సావధానం ప్రయత్నతః।
విరజ్య విషయ వ్రాతాత్
విముక్తి పదమాశ్రయ॥ 45

తా॥ సతతము, మిక్కిలి యత్నమువలన ఆత్మను సావధానమొనర్చి, విషయసుఖాదులనుండి విరక్తినిపొంది, విముక్తి పదమును ఆశ్రయింపుము.

శ్లో॥ విషయేభ్యః పరావర్త్య
సమభ్యస్య శమాదికమ్।
స్వలక్ష్యస్థం మనఃకృత్వా
స్వాత్మన్యేవ సుఖీభవ॥ 46

తా॥ విషయములవలన పరాఙ్ముఖుడవై, అంతరింద్రియ నిగ్రహాదులను చక్కగా అభ్యసించి, మనస్సును ఆత్మపదార్థ మనెడు లక్ష్యమునందుండు దానినిగా చేసి ఆత్మయందే సుఖవంతుడవుకమ్ము.

శ్లో॥ వైరాగ్యేణ పరాభక్త్యా
చింతయన్ మాముమాధవమ్।
భవతీ హైవ ధన్యాత్మా
సర్వాన్కామాన్ సమశ్నుతే॥ 47

తా॥ (విషయువాంఛలయందలి) వైరాగ్యవముచేతను, అత్యుత్కృష్టమైన భక్తిభావముచేతను, ఉమాధవుడనైన నన్ను (సర్వదా) చింతించుచు జనుఁడు ఇహలోకముననే ధన్యాత్ముడు కాగలఁడు సర్వకామములను అనుభవింపగలడు.

శ్లో॥ సర్వజ్ఞం సర్వశక్తించ
వాత్సల్యాది గుణాలయమ్।
కాంతస్త్వం తేహితంకర్తుం
శీఘ్రం మాంశరణంకురు॥ 48

తా॥ సర్వజ్ఞుడను. సర్వశక్తిమంతుడను. వాత్సల్యము మున్నగు సద్గుణముల కాలయమైనవాడను, నీ హితమును జేయఁగోరుచున్న వాడను అగు నన్ను శీఘ్రముగా శరణు పొందుము.

*ఇతి శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవతః*
*కృతౌ శ్రీమద్భగవద్భారత్యాం ఆధ్యాత్మ విద్యాయాం*
*సప్తమోఽధ్యాయః*

*ఇది శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవత్కృత*
*శ్రీమద్భగవద్భారతి అను ఆధ్యాత్మ విద్యయందు*
*సప్తమాధ్యాయము.*

# ॥श्रीमद्भगवद्भारती॥

## శ్రీమద్భగవద్భారతీ

### అష్టమోఽధ్యాయః

శ్లో॥ అనురాగేణ సద్భక్త్యా
ప్రేమ్ణాశుద్ధేన చేతసా।
స్మరన్మామాత్మభావస్థం
జ్ఞానం పరంసమశ్నుతే॥ 1

తా॥ మానవుఁడు అనురాగముతోడను, చక్కని భక్తితోడను, (నాయందలి) ప్రేమచేత పవిత్రమైన మనస్సు తోడను, ఆత్మభావము నందున్న నన్ను స్మరించుచున్నవాడై ఉత్తమమైన జ్ఞానమును అనుభవించుచున్నాఁడు.

శ్లో॥ మాంయశ్చధ్యాయతే ప్రేమ్ణా
నిత్యయుక్తస్తు నిర్మలః।
స్వప్నజాగరయోస్తస్య
దర్శనంమే దదామ్యహమ్॥ 2

తా॥ ఏమానవుఁడు నిత్యముసమాహితుడై నిర్మలుడై ప్రేమతో నన్నుధ్యానించుచున్నాఁడో, అట్టివానికి స్వప్నము నందును, జాగ్రదవస్థయందును నా దర్శనము నొసంగుదును.

శ్లో॥ సగుణేష్వపిరూపేషు,
దృష్ట్వామాం జగదీశ్వరమ్॥
నజానంతి పరంతత్త్వం
కామక్రోధ పరాయణాః॥ 3

తా॥ (సహజముగా నిర్గుణుఁడనయ్యును లోకానుగ్రహము కొఱకు నేను ధరించిన) సగుణములైన రామకృష్ణా ద్యవతార రూపములయందు జగదీశ్వరుఁడనైన నన్నుగాంచి, కామక్రోధ పరాయణులగు నరులు పరమాత్మ తత్త్వమును (ఆరూపముల యందు) తెలియలేకున్నారు.

శ్లో॥ జగతః పాలనం కర్తుం
భవామ్యనేకరూపధృత్।
అంశావతార లీలాభిః
సదైకోఽప్యహమీశ్వరః॥ 4

తా॥ సర్వేశ్వరుఁడనైన నేను సర్వదా ఒక్కఁడనే యయ్యును, లోకపాలనమొనర్చుటకు, నాయంశము కలిగిన రామకృష్ణాద్యవతారముల యొక్క లీలలతో అనేక రూపములను ధరించినవాఁడనగుచున్నాను (అయినను బుద్ధిమంతుఁడు నాయొక్క ఏకత్వమును గుర్తింపవలెను.)

శ్లో॥ యద్యద్రూపే మనఃకృత్వా
భక్త్యాభజతి కాంక్షయా।
తస్మాత్తాన్ సోఽశ్నుతేకామాన్
దత్తాన్మయైవచాస్థిరాన్॥ 5

తా॥ నరుఁడేయే రూపమునందు మనస్సునుంచి భక్తి తోడను. వాంఛతోడను. భజించునో, నాచే నొసంగఁబడి నట్టివియు, అస్థిరములునైన ఆయా కామములను, తన భక్తి వాంఛల కనుగుణముగా పొందుచున్నాఁడు. (శాశ్వతమైన పరతత్త్వమును భజించినచో దానినికూడ పొందగలడని భావము.)

శ్లో॥ దేవేజ్యాః పితృభూతేజ్యాః
తాంస్తాన్యాంతి క్రమాద్ధివై।
యాతాయాతంఫలంత్వల్పం
తేషాం భవత్యశాశ్వతమ్॥ 6

తా॥ దేవతలను, పితృదేవతలను, పృథివ్యాది భూతములను ఆరాధించు మానవులును, క్రమముగా వారివారివలన కలిగెడు ఫలములను బొందుచునే యున్నారు. ఇట్టి ఆరాధన వలన వచ్చుచు పోవుచుండెడు అశాశ్వతమైన అల్పమైన ఫలము మాత్రమే వారికిఁ గలుగుచున్నది (అశాశ్వతమైన వారి నుద్దేశించిన పూజ అశాశ్వత ఫలమును, శాశ్వతమైన దాని నుద్దేశించిన పూజ శాశ్వత ఫలమును గలిగించునని భావము.)

శ్లో॥ త్యక్త్వామాంమోక్షదం విష్ణుం
ప్రాకృతాన్సకలాన్సురాన్।
ఇహాముత్ర ఫలాసక్తాః
ప్రార్థయంత్యల్ప మేధసః॥ 7

తా॥ నిత్యమైన మోక్షఫలము నొసగునట్టి సర్వవ్యాపకుఁడనైన నన్ను విడిచి ఇహలోక పరలోక సుఖములయందాసక్తి కలవారగు అల్పబుద్ధులు, ప్రాకృతులైన సకల దేవతలను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ భోక్తార మవిదిత్వైవ
సర్వయజ్ఞప్రభుంచ మామ్।
అయధావిధి యజ్ఞైస్తే
ఫలభ్రష్టా భవంతిహి॥ 8

తా॥ పరమాత్మనగు నేనే సర్వయజ్ఞములకు ప్రభువును తత్ఫలములను భోగించువాడను అని తెలియక, శాస్త్రవములకు విరుద్ధవములైన కర్మాచరణములచేత మానవులు ఫలములను పొందని వారగుచున్నారు.

శ్లో॥ యేకామాస్తు త్వయాలబ్ధాః
దత్తాన్విద్ధిమయైవతాన్।
కామాంస్తేపూరయన్తంమాం
సర్వకాల మనుస్మర॥ 9

తా॥ నీవనుభవించెడు సర్వకామములును పరమాత్ముడనైన నేనొసంగినవియేయని గుర్తింపుము. కావున నట్టి నీసర్వకామములను పూరించుచున్న నన్ను సర్వకాలములయందును విడువక స్మరింపుము.

శ్లో॥ భావేన యేనకేనాపి
మతింమయి విధత్స్వతే।
లభసే వాంఛితార్థంత్వం
ప్రీతేమయి జనార్దనే॥ 10

తా॥ ఏ భావవముతోడనైనను నాయందు నీబుద్ధిని లగింపఁజేయుము. జనార్దనుఁడనైన నేను ప్రీతుడనుకాగా నీవు కోరినదానిని పొందుదువు. (పరమాత్మ ప్రీతి నొందనిచో నేయదియు సఫలము కాదని భావము.)

శ్లో॥ చిత్రం మే విగ్రహంవాపి
సంస్థాప్యాగ్రేహ్యసంశయః।
నమంస్తువన్ సదాభక్త్యా
స్మరన్ మాంపరమశ్నుతే॥ 11

తా॥ నాయొక్క (అవతారములయొక్క) చిత్రపటమును గాని విగ్రహమునుగాని ముందు ప్రతిష్ఠించుకొని (అందలి పరమాత్మ భావమునందు) సంశయములేని వాఁడై నమస్కరించుచు, స్తుతించుచు, ఎల్లప్పుడు భక్తితో స్మరించుచున్న మానవుఁడు పరమాత్మనగు నన్ను పొందఁగలఁడు.

శ్లో॥ ఏకం మాం బహుధావిప్రాః
సచ్చిత్సుఖ స్వరూపకమ్।
వదన్తి రుచివైచిత్ర్యాత్
భజతాం సౌఖ్య హేతవే॥ 12

తా॥ సచ్చిదానందరూపుఁడైన ఒక్కడనేయగుననన్ను రుచిభేదమువలన పండితులు, భజించువారి సౌఖ్యము కొఱకు అనేక విధములుగా చెప్పుచున్నారు.

శ్లో॥ మయియస్య పరాభక్తి
ర్దేవదేవే జగద్గురౌ।
జ్ఞాతం భవతి తస్త్యైవ
శ్రుతంయత్తత్త్వమాత్మనః॥ 13

తా॥ దేవదేవుడను, జగత్తున కంతటికిని గురువునైన నాయందు ఎవ్వనికి అతిశయమైన భక్తియుండునో అట్టివానికి మాత్రమే శ్రుతమైన ఆత్మతత్త్వము చక్కగా అవబోధన మగుచున్నది. (అన్యునకు శ్రుతమైనను, బుద్ధికి పట్టదని భావము)

శ్లో॥ ప్రాణేశ్వరం మనోనాథం
ప్రియం మాం పరమేశ్వరమ్।
భక్తియుక్తోఽభిజానాతి
ప్రేమగమ్యం సుఖాలయమ్॥ 14

తా॥ ప్రాణవుల కీశ్వరుఁడను, హృదయమునకు నాథుఁడను, ప్రియుఁడను పరమేశ్వరుడను అగు నన్ను భక్తి యుక్తుఁడగువాఁడు ప్రేమచేత పొందఁదగినవానినిగా, సుఖములకు నిలయమైన వానినిగా తెలియుచున్నాడు.

శ్లో॥ యత్ర యత్రాస్తి మద్భక్తః
తత్రతత్రభవామ్యహమ్।
యత్రమే కీర్తనంచాస్తి
తత్రైవ నివసామ్యహమ్॥ 15

తా॥ ఎక్కడెక్కడ నాభక్తుడు ఉండునో అచ్చటచ్చట నేనుందును. నాకీర్తనము ఎచట జరుగునో అచ్చటనే నేను నివసింతును.

శ్లో॥ మదధీనం జగత్కృత్స్నం
జానీహ్యేతత్సునిశ్చితమ్।
స్పందనంతు తృణస్యాపి
భవత్యేవ మదాజ్ఞయా॥ 16

తా॥ (ఓ బుద్ధిమంతుడా) జగత్తు సమస్తము నాకు అధీనమైనదియే. ఇది చక్కని కారణములచేత నిశ్చితమైనదిగా తెలిసికొనుము. (ఇట్టి నా అధీనమైన జగత్తునందు) గడ్డిపరకయొక్క కదలికయు నా ఆజ్ఞచేతనే జరుగుచున్నదని ఎఱుగుము. (అనగా నేను నాది అను భావములను పరిత్యజించి పరమాత్మ నాశ్రయింపవలెనని భావము.)

తే॥ త్వత్సర్వం మేసమర్ప్యాశు
నిశ్చయేనభజస్వమామ్।
క్షేమం తవవహన్నిత్యం
కైవల్యంచ దదామ్యహమ్॥ 17

తా॥ నీకు సంబంధించిన సర్వస్వమును నిశ్చయబుద్ధితో శీఘ్రముగా నాకు సమర్పించి నన్ను సేవింపుము. (అట్లు చేసినచో) నీ క్షేమమును సర్వదా వహించువాడనై కడకు (దుస్సాధ్యమైన) మోక్షానందమును నీకు కలిగింతును.

శ్లో॥ యోగక్షేమాదికం సర్వం
యచ్ఛతి మయి శంకరే।
నిధాయ దృఢవిశ్వాసం
సుఖం తిష్ఠంతి యోగినః॥ 18

తా॥ సర్వలోకములకు యోగక్షేమములు మున్నగు వానిని సమస్తమును ప్రసాదించుచున్న మంగళకరుఁడనైన నాయందు అచంచలమైన విశ్వాసమునుంచి యోగులు (శాశ్వతమైన) సుఖముతో నున్నారు. (నీవును అట్టి సుఖమును ఆ మార్గమునఁ బొందవలయును.)

శ్లో॥ నమేలాభాయ సాభక్తిః
క్రియతేయా జనైరిహ।
తేషామేవోపకారార్థం
కార్యామయి సదైవసా॥ 19

తా॥ ఈలోకమున జనులు చేసెడు భక్తివలన నాకెట్టి లాభమును గలుగదు. వారివారిభక్తి వారికే ఉపకారమును కలిగించును. అందువలన (అచంచలమగు) భక్తిని సర్వదా నాయందు తప్పక చేయవలయును.

శ్లో॥ మదేక శరణోధీమాన్
భక్తోమే న వినశ్యతి।
ఇత్థం ప్రకటయన్ లోకే
ప్రతిజ్ఞాం కురునిశ్చితః॥ 20

తా॥ 'బుద్ధిమంతుఁడు పరమాత్మనైన నన్నొక్కనినే శరణు పొందును. నాభక్తునకు వినాశములేదు' అను ఈ భావమునందు నిశ్చయజ్ఞానముకలిగి లోకమునందా భావమును ప్రకటించుచు ప్రతిజ్ఞచేయుము.

శ్లో॥ అన్యద్విస్మృత్యయద్బాహ్యం
యేమాంస్మరంతి నిత్యశః।
కృతకృత్యాంశ్చ తాన్విద్ధి
మయాపహృతమానసాన్॥ 21

తా॥ బాహ్యములైన సమస్త విషయములను విస్మరించి అంతరాత్మనైన నన్నే నిత్యము స్మరించువారిని, నెరవేరిన ప్రయోజనము కలవారనియు, నాచే అపహరింపఁబడిన మనస్సు కలవారనియు గుర్తింపుము. (వారి మనస్సును నేనపహరించుటవలన వారు నావారగుదురని భావము.)

శ్లో॥ నిర్భరప్రేమభావేన
మతింమయి సదాకురు।
దుఃఖం తవేహసంసారే
దూరీకరోమి తేజసా॥ 22

తా॥ నిండైన ప్రేమభావముతో (పరమాత్మనైన) నాయందు నీబుద్ధిని సర్వదా లంగింపఁజేయుము. దానివలన ఈ సంసారమునందలి నీ దుఃఖమును నా తేజస్సుచేత దూరముగా తఱిమి వేయుదును.

శ్లో॥ సర్వైర్నిరుధ్యమానోఽపి
బాధ్యమానోఽపి సర్వశః।
కృతాత్మా నజహాత్యేవ
భక్తింమయి వినిర్భయః॥ 23

తా॥ నాయందు నిశ్చలమైన మనస్సుకల భక్తుఁడు, సర్వులచేత సర్వవిధములచేత నిరోధింపబడిన వాడైనను, అన్ని విధములైన బాధలు పొందినవాడైనను, వానివలన భీతి నొందనివాఁడై నాయందలి భక్తిని విడువనే విడువడు.

శ్లో॥ సమాశ్రిత్యేశ్వరం మాంయః
భూయఃకరోతి సంశయమ్।
నాన్యోఽస్తి రక్షక స్తస్య
శంకితాత్మా వినశ్యతి॥ 24

తా॥ పరమేశ్వరుఁడనైన నన్ను సమాశ్రయించియు మరల ఎవనికి నాయందు సంశయము కలుగునో అట్టివానికి రక్షకుఁడు వేరెవ్వడును కలుగడు. పరమాత్మనుగూర్చి శంకించు మనస్సు గలవాఁడు తప్పక వినాశము నొందును.

శ్లో॥ భజనాన్మమ మద్భక్తం
నిరోధయతి యః పుమాన్।
నష్టపుణ్యోభవేచ్ఛీఘ్రం
స్వయం కృతాపరాధతః॥ 25

తా॥ నా భక్తుఁడొనరించు నా భజనమునుండి వానిని అడ్డగించు పురుషుఁడు పురాకృతమైన పుణ్యమునుకూడ చాల త్వరగా కోల్పోవును. ఇట్టి నష్టము స్వయంకృతమైన అపరాధము వలననే కలుగుచున్నది.

శ్లో॥ క్లేశకృన్మమభక్తస్య
భవపాశైర్ప్రబధ్యతే।
మద్భక్త సుఖకారీయః
ముచ్యతేసో౽పిబంధనాత్॥ 26

తా॥ నా భక్తునకు కష్టమును కలిగించువాడు భవమనెడు పాశములచేత దృఢముగా బంధింపఁబడును. నా భక్తునకు సుఖమును గలిగించు పుణ్యాత్ముడు నా భక్తునితో పాటు జన్మబంధమునుండి ముక్తుడగును.

శ్లో॥ అపరాధ్యతి యన్మహ్యాం
దుర్జనః తత్సహామ్యహమ్।
సాధూన్ప్రతికృతం దౌష్ట్యం
కించిచ్చ నసహామ్యహమ్॥ 27

తా॥ నాకు అపరాధమును జేయు దుర్జనుని దుర్మార్గమును నేనెట్లైనను సహింతును. కాని సాధువులయెడల చేయఁబడిన దుష్టత్వమును అణుమాత్రమును నేను సహింపను.

శ్లో॥ అహం తవజనో౽స్మీతి
వదంతం శరణాగతమ్।
స్నేహదృష్ట్యా౽వలోక్యాహం
ప్రాపయామ్యభయంక్షణాత్॥ 28

తా॥ ఓ స్వామీ! నేను నీవాడను అని పలికి సర్వాత్మనా శరణుపొందినవానిని నేను స్నేహదృష్టితో స్వీకరించి, క్షణములో వానిని భయరహితమైన (మోక్ష) స్థితిని పొందఁజేయుదును.

శ్లో॥ భక్త్యా సమర్ప్యమాణేషు
మనోభక్తస్యమే ప్రియమ్।
తస్మాత్ప్రీణయితుం మాంతే
మనోమహ్యం సమర్పయ॥ 29

తా॥ భక్తుడు భక్తితో సమర్పించు ఫలపుష్పతోయాదులయందు, అతని మనస్సు నాకు అత్యంతము ప్రియమైనది కావున నన్ను ప్రీతునిచేయుటకు ఓ భక్తుడా! నీ మనస్సును నాకు సమర్పించుము.

శ్లో॥ అసాధుః పతితశ్చాపి
మత్ప్రపత్త్యావిశుధ్యతే।
పతితం పావనం కృత్వా
పాలయామి ప్రసాదతః॥ 30

తా॥ మానవుఁడు (ఇంద్రియ లౌల్యములచే) భ్రష్టుఁడై నప్పటికిని, పతితుఁడైనప్పటికిని (వానిని గుర్తించి) నన్ను శరణాగతి పొందినచో అతఁడు విశుద్ధుఁడగుచున్నాడు. అట్లు పతితుడైనవానిని నా అనుగ్రహమువలన పవిత్రునిగా చేసి అతనిని రక్షింతును.

శ్లో॥ మాతేభవతుసంకోచః
సేవితుం మాం పరాత్పరమ్।
సర్వలోకాధినాథంతు
సర్వభూత హృదాలయమ్॥ 31

తా॥ ఓ మానవుఁడా! పరాత్పరుఁడను, సర్వలోకములకు అధినాథుఁడను, సర్వభూతములయొక్క హృదయములే ఆలయములుగా కలవాఁడను అగు నన్ను సేవించుటకు నీకు సంకోచము కలుగకుండుఁగాక!

శ్లో॥ మాంత్వాశ్రయన్నరోధీమాన్
పరాం శాంతిం నిగచ్ఛతి।
అహంకారేణ మాం త్యక్త్వా
లభతే నారకీంగతిమ్॥ 32

తా॥ బుద్ధిమంతుఁడగు నరుడు పరాత్పరుఁడనగునన్ను సమాశ్రయించి (నాశరహితమైన) పరాశాంతిని పొందుచున్నాఁడు. అహంకారముతో నన్ను పరిత్యజించి (మహాఘోరమైన) నరకమార్గమును బొందుచున్నాఁడు.

శ్లో॥ సదాహమనుగృహ్ణామి
భక్తంమమ జితేంద్రియమ్।
తనుర్ధనం మనోబుద్ధిం
మహ్యంసమర్ప్యసంస్థితమ్॥ 33

తా॥ సర్వేంద్రియములను జయించి, ఈశరీరమును, ధనమును, మనస్సును, బుద్ధిని నాకు సమర్పించి సుస్థితియందున్న నా భక్తుని సర్వదా నేననుగ్రహింతును.

శ్లో॥ నాస్తిమేమతభేదశ్చ,
పాక్షికత్వంచ నిర్దయా।
పాలయామి తథాసర్వాన్
యథాధర్మ స్సనాతనః॥ 34

తా॥ నాకు ఆయావ్యక్తులవలంబించెడు మతభేదములు లేవు. (ఆయాభేదములనుబట్టి యేర్పడిన) పక్షపాతముకూడ లేదు (అందువలన కొందరియందు) దయ లేకుండుటలేదు. కావున సనాతనమైన వేదధర్మానుసారము సర్వులను నేను సంరక్షింతును.

శ్లో॥ విరక్తిస్తు ప్రపంచేఽస్మిన్
దృఢభక్తిస్సదామయి।
యస్యేహ ధీమతః పుంసః
జనిస్తేన పరాజితా॥ 35

తా॥ ఈ భౌతిక ప్రపంచమునందు విరక్తియు, పరాత్పరుఁడనైన నాయందు అచంచలమైన భక్తియును ఏ బుద్ధిమంతునికి కలుగునో అట్టివాఁడు భవరోగమును పరాజితమొనర్చును. (మోక్షానందము నొందునని భావము.)

శ్లో॥ అకామోయః ప్రశాంతాత్మా
గతలోభో మహామతిః।
మన్మనా మద్గతప్రాణః
మాముపైతి సనాతనమ్॥ 36

తా॥ కామములను పరిత్యజించి ప్రశాంతమైన ఆత్మకలవాఁడై లోభమును నిర్జించి మహామతియైన మానవుడు నాయందు లగ్నమైన మనస్సు, ప్రాణముగలవాఁడై సనాతనుఁడనైన నన్నుపొందును.

శ్లో॥ బాలకేనాప్యహంలభ్యః
శుద్ధస్సయది భక్తితః।
ప్రమాదినా మహంకారాత్
మహతామపి దుర్లభః॥ 37

తా॥ భక్తిభావమువలన శుద్ధుఁడైనచో బాలకుఁడు కూడ నన్ను పొందగలడు. అహంకారమువలన ప్రమత్తులైన గొప్పవారికి కూడ నేను దుర్లభుడనగుదును.

శ్లో॥ కృపామృతరసం నిత్యం
వర్షామ్యహం ప్రకర్షతః।
సర్వోపరి మహాప్రేమ్ణా
భక్తాజానంతి తద్విధమ్॥ 38

తా॥ పరమాత్ముఁడనైన నేను కృపయనెడు అమృత రసమును మిక్కిలి అధికముగా సర్వులపైనను వర్షింతును కాని దానిని గుర్తెఱిగిగ్రహింపగలిగినవారు భక్తులు మాత్రమే.

శ్లో॥ మద్భ్రేమప్రవణం చిత్తం
ముదాకురుతవోత్తమ।
మత్ప్రేమీమోక్షమాప్నోతి
వచ్మ్యహం పరమేశ్వరః॥ 39

తా॥ ఓ ఉత్తముఁడా! నీ చిత్తమును సంతోషపూర్వకముగా నా ప్రేమరసము ప్రవహించు పల్లపుచోటుగా చేయుము. నా ప్రేమకు స్థానమైనవాడు మోక్షమును పొందును పరమేశ్వరుఁడనగు నేను చెప్పుచున్నాను (విశ్వసింపుము.)

శ్లో॥ కళత్రపుత్ర రాజ్యాని
పశ్వాలయధనానిచ।
కులం మానంసఖీన్ బంధూన్
సర్వంత్యక్త్వావ్రజస్వమామ్॥ 40

తా॥ భార్యాపుత్రులను, రాజ్యమును పశువులను గృహములను, ధనమును, కులమును, మానమును, సఖులను, బంధువులను ఇదియదియననేల సర్వమును పరిత్యజించి నన్ను చేరుము.

శ్లో॥ అచింత్యానంత శక్తిం మాం
విధేయమాయమచ్యుతమ్।
జానీహి భక్తిభావేన
సర్వత్రాతారమీశ్వరమ్॥ 41

తా॥ ఊహింపనలవి కాని అనంతమైన శక్తి కలవాఁడను మాయను లోబరచుకొన్నవాఁడను నాశరహితుఁడను.

సర్వలోకములకు ఈశ్వరుఁడను రక్షకుడను అగు నన్ను భక్తి భావముతో తెలిసికొనుము.

శ్లో॥ మామేవ సర్వతః పశ్యన్
మన్యమానః కృతార్థతామ్।
స్వానందరస సంతృప్తః
సుఖంతిష్ఠ సదానఘ॥ 42

తా॥ సర్వ ప్రదేశములయందు (సర్వ కాలముల యందును) నన్నే చూచుచున్నవాడవై (అట్టిచూచుటవలన) జన్మమునకు సఫలత్వము కలిగినదని భావించుచున్న వాఁడవై ఆత్మానందరసముచేత తృప్తినొందినవాడవై ఓపుణ్యాత్ముడా! సర్వదా సుఖముగా నుండుము.

ఇతి శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవతః
కృతౌ శ్రీమద్భగవద్భారత్యాం ఆధ్యాత్మ విద్యాయాం
అష్టమోఽధ్యాయః

ఇది శ్రీ విశ్వగురు శ్రీమద్విద్యారణ్య భగవత్కృత
శ్రీమద్భగవద్భారతి అను అధ్యాత్మవిద్యయందు
అష్టమాధ్యాయము.

# ॥श्रीमद्भगवद्भारती॥

# శ్రీమద్భగవద్భారతీ

## నవమోఽధ్యాయః

శ్లో॥ నిత్యంయచ్చ సుఖంపూర్ణమ్
దుఃఖలేశ వివర్జితమ్।
స్వాంతస్థం సర్వగమ్యంతత్
యథాప్రాప్స్యసితచ్ఛృణు॥ 1

తా॥ ఓ మానవుఁడా! సుఖకరమును, పూర్ణమును, చరాచరముల అంతఃకరణములలో నుండునదియు, దుఃఖము లేశమైనను లేనిదియు సర్వులకు, సర్వముకుఁ జేరఁదగినదియునగు ఆనిత్యవస్తువును ఎట్లుపొందగలవో దానిని వినుము.

శ్లో॥ దీనత్వ పరిహారార్థం
నిర్భయత్వ ప్రసిద్ధయే।
ఆత్మతత్త్వం సువిజ్ఞేయం
శ్రేయస్కామైర్విచక్షణైః॥ 2

తా॥ దైన్యమును దూరముగా తొలగించుటకును, భయ రహితమైన ప్రసిద్ధికొఱకును, శ్రేయస్సును వాంఛించెడు వివేకవంతులచేత, పరమాత్మ తత్త్వము చక్కగా తెలియఁదగినది.

శ్లో॥ భూతప్రకృతి విజ్ఞానాత్
యత్సౌఖ్యం లభతేనరః।
హేయం తన్నశ్వరత్వాచ్చ
పరాంశాంతిం నయచ్ఛతి॥ 3

తా॥ భూతములకు (పృధివ్యాది) ప్రకృతికి సంబంధించిన విజ్ఞానము వలననరుఁడే సౌఖ్యమును బొందుచున్నాడో, అయ్యది నశించు స్వభావము గలదగుటవలన హేయమైనది (పరిత్యజింపఁదగినది) అట్టి సుఖము నపేక్షించువాడు ఉత్కృష్టమైన శాంతిని బొందఁజాలఁడు.

శ్లో॥ బహిర్నిమిత్తకం సౌఖ్యం
హ్యానిమిత్తే వినశ్యతి।
ఆత్మానంద స్స్వయంసిద్ధః
పరిపూర్ణశ్చ శాశ్వతః॥ 4

తా॥ బాహ్యములైన నిమిత్తములచేత కలుగు సౌఖ్యము ఆ నిమిత్తము నశించిన వెంటనే తానును నశించును. ఆత్మానందమో; అయ్యది (నిమిత్తములు లేకుండఁగనే) స్వయముగనే సిద్ధించునట్టిది. (కావుననే) పరిపూర్ణమై నాశములేనిదై విలసిల్లుచున్నది.

శ్లో॥ ఆదౌ కుతూహలాన్మర్త్యః
విషయార్థేషు సజ్జతి।
సంగజాలై స్తతో బద్ధః
బహిర్గంతుం న శక్నుతే॥ 5

